# వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి కథలు

# 03-12-2024  to 26-12-24



17.పార్వతీ పరమేశ్వర తత్వము .  **27 -12 -24**

నిన్నటి ఉదయము ఓ మందార చెట్టు మొగ్గ వేసింది . అది ఈ ఉదయము వికసించి - ఆ సాయంత్రానికి రాలి పడి పోయింది . మందారపు చెట్టు ఎన్నో యుగాలనుండీ వున్నది . అన్ని యుగాలలోనూ ఇట్లాగే చేస్తూ వున్నది . యుగ యుగాలుగా ఒక్క రోజు ఉండి రాలిపోయే పువ్వును ప్రసవించి - దాన్ని కోల్పోయాక - అదుఃఖాన్ని జయించి మరుసటి రోజున మరో పువ్వును కనగలిగిన శక్తి ని చెట్టుకు ఎవరు ఇస్తున్నారు? .

ఒక లేడి పరుగెత్తుతూ వున్నది . దాని వెంట ఒక పులి పడింది . లేడి పులికి ఆహారం అయ్యింది . దానిని కన్న తల్లి లేడికి అది ఓ దుఃఖము అయింది . కానీ ఇదేలేడి మళ్ళా పిల్లలని కంటుంది .

లేడిని వేటాడే పులికి పెద్దవసొచ్చి లేడిని వెంబడించి చంపలేని అశక్తత వచ్చి - ఆహారం దొరక్క చచ్చింది . అది చూసిన ఇంకో పులి నాకే కాదు నా కడుపున పుట్టిన ప్రతి పిల్లకూ ఇట్లనే అవుతుంది అని తెలుసుకుంటుంది . కానీ ఆ పులి కూడా పిల్లలను కనటం మానలేదు.

యుగయుగాలుగా లేళ్ళు పులులు పుడుతూనే వున్నాయి . ఇక్కడ రెండు విభిన్న ధృవాలు తమ దుఃఖాన్ని జయించి మరుసటి తరానికి జన్మ ఇస్తూ వున్నవి .ఈ కష్టాలు మానవులకూ వున్నవి , వారు అన్నీ తెలిసీ, మరో తరాన్ని సృష్టి చేస్తూ వున్నారు . ఈ దుఃఖాన్ని జయించి ముందుకు సాగి పోగల శక్తి ఎవరు ఇస్తూ వున్నారు ?

తల్లి పార్వతి ఇస్తూ వున్నది . ఆమె ఇచ్చిన ఈ శక్తి ఏ జగత్తును పుట్టిస్తున్నది .జగత్తుకు మూలము అవుతున్నది. అట్లాగా ఆమె జగన్మాత అయ్యింది . వినాయకుడు మరణించినపుడు పార్వతీ మాత యొక్క దుఃఖము చూడలేక ఈశ్వరుడు ఏమిచేశాడో మనకందరకూ తెలుసు . మరో సృష్టి జరిపాడు . తద్వారా పార్వతికి తన శక్తిపై ఇష్టత పెంచాడు .

మన తల్లి పార్వతి మన భూమిపై మరణించిన ప్రతి ప్రాణీ తన శిశువే అన్నట్లు దుఃఖిస్తూ ఉండవచ్చు. ఆమె దుఃఖము బాపుటకు అని పరమేశ్వరుడు ప్రతి

జీవికీ మరొక పునర్జన్మ , మరొక రూపము ఇస్తూ ఉండవచ్చు . పునర్జన్మల యందు మన నమ్మకమునకు మూలము ఇదే అనుకొందాము .

దుఃఖాన్ని ఎదుర్కొనే శక్తిని ప్రతి ఒక్కరికీ ఇవ్వటం మాత యొక్క ఇష్టత అయితే - ఆ ఇష్టత తగ్గి పోకుండా చూసుకోవటం తండ్రి పరమేశ్వరునికి ఇష్టత అనుకోవచ్చు . ఇద్దరూ పరస్పర ఆశ్రయాలు . అందువల్ల వారు అర్ధ నారీశ్వరులు .

నిత్య జీవితంలో కూడా - ప్రతి పురుషుడూ కుటుంబానికి అన్నీ సమకూర్చి - పిల్లల పట్ల భార్యలో ని ఇష్టత పెంపు చేస్తూ వుంటాడు . పిల్లలు అంటే తండ్రికి ఇష్టత కలిగేట్లు ప్రతి స్త్రీ తన పిల్లలను పెంపు చేస్తూ ఉంటుంది . ఇట్లా ప్రతి భార్యా భర్తా కూడా అర్ధ నారీశ్వరులే .

తెలుగు వారికి ఉదయం ఓ కాఫీ , సాయంత్రానికి ఓ ఆధ్యాత్మిక చింతన అవసరం అని ఎవరో అన్నారు . అది నిజమా

రచన వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

**16.**ఓ సలహా **26 -12 -24**

ముందు మీరొక పాత ప్రేమగీతం నేర్చుకోండి . మీకు పెళ్లి అయితే భార్యకన్నులలోకి , పెళ్లి కాకపోతే ప్రేయసి కన్నులలోకి చూస్తూ ఒక్క క్షణం ఆ పాటను పాడండి . పాడుతూ ఆమెకన్నులలోకి చూడటమే అతి ముఖ్యము కానీ ఏ పాట అన్నది ముఖ్యము కాదు . ఇది మీరు ప్రేయసికి గానీ భార్యకు గానీ దూరమైనపుడు మిమ్మల్ని అనేక దుఃఖాలనుండి దూరం చేస్తుంది . ఆ ఒక్క క్షణం మీ జీవితానికి తోడుగా ఉంటుంది .ఆ కన్నులు మిమ్మల్ని స్పృశిస్తూ ఉంటాయి స్వానుభవం తోనో అది లేకుండానో చెప్పలేదు .చేయలేక పోయానే అనే నీ మీద బాధ కొద్దీ చెపుతున్నాను.

వారణాసి ఉమా శ్రీరామా కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ

## 15.సింహాల సేల్స్ మ్యాన్ 26 -12 -24

మహా నగరం అంటే లక్షలాది జనమే కాదు - లక్ష లాది నోర్లు - లక్షలాది కళ్ళు కాళ్ళు- పళ్ళు చేతులు , అనారోగ్యాలు , కూడా . ఇది తెలుసుకున్న వ్యాపార సింహాలకు ఇదొక వేట ప్రదేశం . డిస్కవరీ సైన్స్ ప్రకారం ఒక పెద్ద సింహం దేనిని వేటాడాలి అనే దానిని నిర్ణయిస్తే - మిగతా సింహాలు ఆ వేటకు

సహకరిస్తాయి . ఇట్లా చూస్తే మహానగరం లో వున్న ప్రతి సేల్స్ మ్యాన్ కూడా ఓ సింహమే . ఇందులో అతి చక్కని బుద్ధి బలము , కల సింహాలు కూడా ఉంటాయి . మీరు అలాంటి సింహపు కంటిలో కనుక పడ్డారు అంటే మీరు ఆ వేటనుండి తప్పించుకోవటం అసాధ్యం . ఆ సింహము మిమ్మల్ని వేటాడి తమ పెద్దబాసు ఐన మరో సింహానికి సమర్పించుకొని - మీలోని కొంత మాంసాన్ని తన బహుమతిగా పొందుతుంది .

నేను మహానగరములో ని ఓ సందులోని గొంది లాంటి దారిలో వస్తున్నాను . ఓ పెద్ద చతురస్రాకారపు గొడుగు తయారు చేసి దాన్ని నేల మీద బోర్లిస్తే ఎలా ఉంటుందో అలాంటిది ఒకటి కనపడింది . బట్ట లతో కట్టి న చిన్న గదిని చూసాను అంటే సరిపోతుంది .ఆసక్తి కొద్దీ ఏమిటా అని ఆగి చూసాను ." రండి సర్ రండి అంటూ ఒకాయన నన్ను చేయి పట్టుకొని గదిలోకి లాగాడు . ఆ లాగుడుకి - గదిలో ఏముందో? అనే ఆలోచన తోడై , నేను ఈజీగా లోపలికి వెళ్ళాను . ఆ గదిలో ఓ యాక్టివా స్కూటరు ఉంటే దాని సీటు మీద నన్ను కూచో పెట్టాడు . చక చక చుట్టూ వున్న ఛార్జింగ్ మీద పనిచేసే లైట్లు ఆన్ చేసాడు . సర్ తల అటు తిప్పండి ఇటు తిప్పండి అన్నాడు. వెట్ టిష్యూ పేపర్ ఇచ్చి మొహం తుడుచుకోండి అన్నాడు . ఎదో ఒక అసంకల్పిత చెర్యలుగా - నేను దువ్వెన తీసి తల దువ్వుకున్నాను . అప్పుడు అతను అద్దం పట్టాడు . నన్నేదో సినిమా క్యారెక్టర్ కు సెలెక్ట్ చేస్తున్నారా అన్నట్లు మా తతంగం నడిచింది . అతడు తన సెల్ఫోను కెమెరా తో నా ఫోటో తీసి దాన్ని రకరకాలుగా ఎడిట్ చేసి - నేనంటే నాకే ముద్దొచ్చే ఓ ఫోటో నాకు చూపాడు.

" నేను సెలెక్ట్ అయ్యానా ? ఈ ఫోటో నా వాట్స్ అప్ కి పంపుతారా ? మా ఆవిడకి చూపిస్తాను అన్నాను . ఓకే సర్ మీరు సలెక్ట్ అయ్యారు , మా కంపెనీ వారి ఫ్రీ సిమ్ కు సెలెక్ట్ అయ్యారు . ఇప్పుడు ఇక్కడ ఫింగర్ పెట్టండి అన్నాడు . పెట్టగానే అతని ఫోనులో నా ఆధార్ డిటైల్స్ ఓపెన్ అయ్యాయి ." సార్ మా కంపెనీ "సిక్స్ జీ" సింకార్డ్ మీకు ఫ్రీగా ఇవ్వటాన్ని యాక్సెప్ట్ చేసింది .

. మీరు ఇక్కడ సంతకం పెడితే ఆ సిమ్ ను ఆక్టివేట్ చేసి మీ ఫోటో మీకు పంపుతాము అన్నాడు . ఇదంతా జరగ టానికి  మీరు ఈ  కథ చదవటానికి పట్టిన సమయంలో సగం సమయమే పట్టింది . నా మీద నాకున్న ప్రేమతో నేను సిం తీసుకొని బయట పడ్డాను .

నాకు ఫ్రీగా ఇచ్చినంత మాత్రాన అతనికి పోయేది ఏమీలేదు . నేను సిమ్ వాడితే అతని కంపెనీకి ఎంతో ఆదాయము వచ్చి -  అందులో నుండి ఇతనికి కొంత ఆదాయము అందుతుంది .
మహానగరాల్లో వుండే సేల్స్ మెన్  అనే సింహాల వేట ఇట్లా ఉంటుంది . వారి వేటను మీరు తప్పించుకోలేరు .

సరే ఈ సంగతి అటుమొన్న జరిగింది అనుకుంటే - నిన్న సింహపు ముఖపు బొమ్మ చిత్రించి వున్న ఓ రోడ్ సైడ్ సేల్స్ మ్యాన్ ల టెంట్ కనపడింది . వీడెవడో సింహాల సేల్స్ మ్యాన్ లాగా వున్నాడు " సర్ . .. మా కంపెనీ శ్రీ లంక అడవుల్లో సింహాలు పెంచుతున్నది . ఇప్పుడు సింహాల జూలుకు చైనా లో మంచి మార్కెట్ వుంది . మీరు  మా దెగ్గర ఓ ఇన్వెస్ట్మెంట్ కనుక కొనుక్కుంటే - మా సింహపు జూలు అమ్మి మీకు నెలకు లక్ష రూపాయల ఆదాయం ఇస్తాము " అని అంటాడని భయం వేసి - ఆ టెంట్ లో వారు ఎవరూ నన్ను చూడక ముందే ఇంకో సందుకి రూటు మార్చాను సింహపు దాడి తప్పించుకోవటానికి షుడెన్  గా న రూటు మార్చటమే ఉత్తమమైన పని అని డిస్కవరీ ఛానెల్ వారు చెపుతారు . కాబట్టి నేను ఆలా చేసాను . మీరూ అలాగే చేయండి కానీ అనవసరమైన ధైర్యానికి పోవద్దు .

మహా నగరం అంటే లక్షలాది జనమే కాదు పై ఓ   వివరణ  - జనం అంటే కూల్ డ్రింకులు అమ్మేవారికి లక్ష లాది నోర్లు - కళ్లజోళ్లు అమ్మేవారికి లక్షలాది కళ్ళు ,  ఫుట్ వెర్ ఆమె వారికి లక్షలాది కాళ్ళు-   టూత్ పేస్టు  అమ్మేవారికి లక్షలాది పళ్ళు ఇంటూ 32   పళ్ళు .  గాజులుఅమ్మే వారికి లక్షలాది

చేతులు , పనికి రాని నాటు మందులు అమ్మే వారికి లక్షలాది అనారోగ్యాలు ,-- అని
వారణాసి ఉమా శ్రీరామా కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కధ

పై పోస్టుమీద ఒక అభిమాని అభిప్రాయం -

ఎలా వస్తాయి ఇలాంటి కథలు?
ఎంతో ఆలోచన ఉంది.
సైరస్ బ్రోచా అనే అతను కొంతవరకు ఇలా రాసేవాడు.
అతన్ని మించిపోయావు.
ఇలాగే వ్రాస్తూ ఉండు. **Saraswathy Devarakonda**

## 14."బావా నీ భయంలో నిజం లేదు" **24-12-24**

అమరావతి లోని మాఇంటికి నాలుగు ఇండ్ల అవతల ఉన్న ఇంటిలో "బ్రహ్మాన్ బావ" వున్నాడు . అయన ప్రతి విషయాన్ని బ్రహ్మ యొక్కసృష్టి రచనా న చమత్కృతికి ముడి పెట్టి మాట్లాడుతాడు కాబట్టి ఆయనకు " బ్రహ్మాన్ బావ" అనే ముద్దు పేరొచ్చింది. మీ " బ్రహ్మాన్ బావ" నిద్దరలో భయం తో ఉలికులికి పడుతున్నాడు . మీరు రావాలె " అని ఆయన ఇంటినుండి కబురొచ్చింది . నా హెల్ప్ కోసం అని ఎవరో ఒకర్తనాదం చేశారన్న ఫీలింగ్ నాకొచ్చింది . నేను వెళ్లి " అర్జనుడుకి శ్రీ కృష్ణుడు ఉన్నట్లు, మీకు నేనున్నాను . మీకు వచ్చిన భయమేమిటో నాకు చెప్పండని నేను అడిగాను .

"మీరున్నారా ? అయితే వినండి ." నాకు నలుగురు పిల్లలు . ఆ నలుగురికీ నాలుగేసి పిల్లల చొప్పున నాకు పదహారు మంది మనుమలు.ఆ మనుమల్లో ఒక్కొక్కరికీ నలుగురేసి సంతానం చొప్పున ఇప్పుడు అరవై నాలుగు మంది ముని మనుమలు . నావల్ల మొత్తము 84 మంది ఈ భూమి మీదకు వచ్చినట్లు అయింది . మన బ్రహ్మ దేముడు పుట్టిన ప్రతి వారి కోసం అని కొంచెము జాగా సృష్టించి పెడతాడు అనే నమ్ముదాము .కానీ ఈ జాగాని సృష్టించే క్రమంలో నన్ను లేపివేసి- నేను ఖాళీ చేసిన జాగాను నాచే

సృష్టించబడిన జనంలోని ఒకరికి ఇచ్చివేయాలనే చేమత్కారపు ఆలోచన ఏదన్నా ఆయన వేస్తాడేమో అని నాకు భయంగా వుంది ". అన్నాడు .

" బ్రహ్మాన్ బావా . సృష్టి మొదటినుండి జరుగుతున్నదే అది . ఇప్పుడు నువ్వు కొత్తగా భయపడటం ఎందుకు ? అని నేను ఏదో చెప్పాను. కానీ "బ్రహ్మాన్ బావా" నీ భయంలో నిజం లేదు అని మాత్రం చెప్పలేక పోయాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత రచన



**13.**పప్పు శాస్త్రీజీ - హమ్మయ్య అనుకోవటం **..25 -12 -18** అగైన్ ఆన్ **25 -12 -24 .**

నేటికి ఆరు సంవత్సరాల క్రితంనేను ఈ కథ రాసాను అని . దానిని మరల అనరితోటీ షేరు చేసుకుంటారా ? అంటూ ఫేస్బుక్ వారు నాకు ఓ నోటిఫికేషన్ ఇచ్చారు . ఆకథలో చిన్న మార్పులు చేసి ఇప్పుడు మీకు అందచేస్తూ వున్నాను . ఈ కథ రాసినప్పుడు పప్పు శాస్త్రి అనే నా బాల్య స్నేహితునిగా పాత్రగా చేసుకొని రాసాను . అందుకని కధకు ఆ పేరు వుంచాను

ఏదేశపు శాస్త్ర వేత్తలో , ఎక్కడనో , పురాతన తవ్వాకాలు జరిపి, మనుషుల అస్తి పంజరాలు బయటికి తీసి , " ఇదిగో చూడండి , వేయి సంవత్సరాల క్రితం మనుషులు ఇలా ఆరు అడుగుల ఎత్తులో . బలిష్టమైన ఎముకలతో , చెట్లు , కొండలు , ఎక్కటానికి , నదులు దాటటానికి, వ్యవసాయం చేయటానికి వీలుగా నిర్మింప బడ్డాడు " అని చెప్పినట్లు పప్పు శాస్త్రి చదివాడు . చదివినాక "ఇలాంటి పూర్వికులు మనకుంటే వారిని తలచుకొని మనము తలచుకొని గర్వ పడతాం .కానీ " నా తరం అంతం అయ్యి , మళ్లా ఒక వేయి సంవత్సరాలు గడిచి న తరువాత , ఇంకో శాస్త్ర వేత్త ఎవడో తవ్వకాలు జరిపి , నా లాంటి వాడి కంకాళాన్ని బయటికి తీసి ఏమని చెపుతాడు ? విన్నవాళ్లు ఏమనుకుంటారో ? అని ఆలోచించాడు .

"  వేయి సంవత్సరాల క్రింద మానవుడు ..దేహ శ్రమ ఏదీ చేయకుండా , చచ్చు పుచ్చు గా,  బ్రతకటం వల్ల , ఇప్పటి మన తరం .. ఇట్లా తగలడింది . మనం గాజు బొమ్మల్లా తయారయ్యాం , అని అప్పటి శాస్త్రవేత్తలు వివరిస్తారు కాబోలు - అదివిని జనం నాలాంటి వారిని బండ బూతులు  తిడతారు కాబోసు "అని  పప్పు శాస్త్రి ఊహించాడు. ఈ ఊహతో అప్పటి కప్పుడే బీపీ తెచ్చేసుకొని గందరగోళం పడి పోయాడు .
కాసేపటికి తేరుకుని  " నేనెవర్ని ? నన్ను పూడ్చరు .. తగలేస్తారు .. అప్పుడు నా కంకాళం ఎవడికి చిక్కుతుంది.. ఎవడు నామీద నిందలేస్తాడు ? అని అలోచించి రిలీఫ్ ఫీల్ అయి బొజ్జ నిమురుకుంటూ నిద్దరోయాడు   . కానీ ఏదన్నా దేహ పటుత్వాన్ని పెంచే పని చేద్దాము- భవిష్యత్ తరాలు తాలుగింజలుగా మారకుండా చూద్దాము అని మాత్రం ఆలోచించ లే.

వారణాసి ఉమా శ్రీరామా కృష్ణ అఫ్ అమరావతి సొంత కధ

## **12.** అందరి నిరసనలూ కరెక్టే   **23-12-24**

శశి కుమార్ అనే పిల్లవాడు ఇంగిలీషు లో వున్న ఎదో పుస్తకం చదువుతూ తన తాత గారైన అమరావతి శంభు శాస్త్రి గారి వద్దకు వచ్చి "తాతా ఈ పుస్తకంలో నీపేరుంది . అమరావతి అనే మన ఇంటి పేరును బట్టి ఊరుని బట్టి గోత్రాన్ని బట్టి అదినువ్వేనని నాకు అని అనిపిస్తూ వున్నది .  శిల్ప శాస్తానికి చెందిన ఏమో రహస్యాలు నీ నుండీ గ్రహించి వాటి ఆధారంగా తాను  అనేక హిందూ శిల్పాలను పరిశీలించాననిఅందుకు గానూ నీ  ప్రతిభకు తా నెంతో రుణపడి వున్నాను అని ఈ పుస్తకము రాసినయన  రాసుకున్నాడు . అది నువ్వేనా ? అని అడిగాడు .

శంభు శాస్త్రిగారుబ్రిటిష్ కాలపు మనిషి.  ఇప్పటికి  నూరు కు దరిదాపుల్లో వున్నాడు . ఇంకా ఎదో ఆరోగ్యంగానే వున్నాడు . కానీ నీరసంవల్ల

ఆలాపడుకొని వున్నాడు . అందువల్ల అయన భార్య మీనాక్షమ్మ గారు కలుగ చేసుకొని " అది మీ తాతయ్యే రా .. నాకు బాగా గుర్తు . అప్పుడెవరో ఓ ఇంగిలీషు అయన వచ్చి మీ తాత గారిని అడిగి ఏమో విషయాలు తెలుసుకుని రాసుకెళ్లాడు . ఉన్నన్నాళ్ళు మనఇంట్లోనే వున్నాడు మనతిండే తిన్నాడు . అయన వెడుతూ వెడుతూ ఆ బ్రిటీష్ వారికి చెప్పి మీనాన్నకు ఏదన్న వుద్యోగం వేయిస్తాడేమో అని నేను గంపెడు ఆశ కూడా పెట్టుకున్నాను . అయన వూరికే నమస్తే చెప్పి వెళ్ళిపోయాడు . మన సొమ్ము ఆయనకు రుణమున్నట్లు" అంటూ నిరసనగా పలికింది .
శంభుశాస్త్రి గారు ఈ మాటల సవ్వడికి నిద్ర మేల్కొని " ఆరోజున అయన అడగ బట్టీ నేను చెప్పబట్టీ నాకు తెలిసిన కొన్ని శాస్త్రాలు ఇంకా బ్రతికి ఉన్నట్లు - నేను కూడా బ్రతికి ఉన్నట్లు తోస్తోంది . శశీ నువ్వెప్పుడేనా ఏపైనా విషయాలను నన్ను అడిగి ఏదన్నా తెలుసుకోవాలనే ప్రయత్నం చేశావా ? నన్ను మాట్లాడించటం అంటే నేను బ్రతికె వున్నాను అని - నేను కూడా మంచి బ్రతుకే బ్రతికానని లెక్క చేయటం అనీ అనుకున్నావా ?" అన్నాడు నిరసనగా .

" ఈ తాతలు అందరూ ఇంతే . ఏదిచేసినా ఎదో కొంత సంపాదన కోసం చేయక పోయేది . పేరు కోసం చేసేది . ఈయన కనుక సంపాదించి వున్నట్లైతే - నేను ఈ పూరి కొంపలో పడి వుండే వాడినా ? పైగా దీని కోసం అని ఈయన "నేను బ్రతికి వున్న వాళ్లలో లెక్కకు రానా అని ఫీలింగ్ అవటం కూడా ఒకటి " అనుకున్నాడు మనుమడు నిరసనగా .

అందరి నిరసనలూ కరెక్టే కదా ? కొన్ని నిరసనలు చెట్లలా ఎదుగుతూ ఉంటాయి .

వారణాసి ఉమా శ్రీరామా కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ

**11.**పెద్ద రాయుడి గారి తీర్పు **22 -12 -24**

పెద్ద రాయుడి గారి తీర్పు తరువాత ఏమి జరగవచ్చో ?అనే అనుమానమే ఈ కధా వస్తువు .

ఒక మామూలు గ్రామంలో పెద్ద మనుషుల పంచాయతీ అనే న్యాయస్థానం నడుస్తూ వున్నది . ముగ్గురు పెద్దమనుషులు ఈ పంచాయితీకి న్యాయమూర్తులు . కేంద్ర మంత్రి వర్గం లో మంత్రిగా వున్న ఆయనకు బాల్య స్నేహితుడు ఈ పంచాయతీలోని పెదరాయుడు .

ఒకాయనొచ్చి పెదరాయుడికి ఇలా చెప్పుకున్నాడు " రాయుడూ గారూ .. నా భార్యకు జుట్టు ఊడి పోవటం అనే ప్రాబ్లమ్ వుంది . అదేదో యాడ్ లో చూచిన దెగ్గరనించి నా భార్య వెల్లుల్లి తో తయారుచేసిన షాంపూని నిత్యమూ వాడుతోంది . . నీ జుట్టు ఊడినా నాకేమీ పరవాలేదు అంటున్నా ఆమె వినటం లేదు . ఆమె జుట్టు ఆమె ఇష్టం అనుకోటానికి వీలు లేకుండా ఆమె నుండి వెల్లుల్లి వాసనలు ఉబికి వస్తున్నాయి . నేను పడలేకుండా వున్నాను . నాకు విడాకులు ఇప్పించండి " అని కోరాడు .
ఈ ఫిర్యాదు వినగానే ఒకాయన అదాటున లేచి " నా భార్య తన నెరిసిన వెంధ్రుకలు పోవాలని వేపకాయ షాంపూ వాడుతున్నది . వద్దు అని ఎంతచెప్పినా వినటం లేదు . నీ జుట్టు నెరిసినా నాకేమీ పరవాలేదు అని చెప్పినా కానీ ఆమె పట్టించుకోవటం లేదు . ఆమె వేపకాయ వాసన వేస్తున్నది . నాకు విడాకులు ఇప్పించండి " అని కోరాడు .
పై రెండు ఫిర్యాదుల స్ఫూర్తితో ఉత్సాహం పొందిన ఒకాయన లేచి " మా ఆవిడా తన తలవెంట్రకలు బిరుసుగా ఉన్నాయని ఒకటే ఇదై పోతోంది . ఉంటె ఏమైంది లే అని నేను అంటే కూడా పట్టించుకోకుండా కోడిగుడ్డులో పాల మీగడ - ఉడికించిన పెరుగు కలిపి తలకు పూసుకోంటోంది . ఆమె కుళ్ళిన కోడిగుడ్డు ప్లస్ మురిగిన పాల వాసన వేస్తున్నది . నాకూ విడాకులు ఇప్పించండి " అని కోరాడు .

అప్పుడు పేదరాయుడుగారు "ఇది నా ఇంటితో సహా ఊరంతా వున్న ప్రాబ్లెమ్ లాగా వుంది . ఈ ఊరి ఇల్లాలు ఎవరైనాగానీ , తన భర్త " నాకేమీ ఫరవాలేదు అనే భరోసా ఇచ్చిన తదుపరి కూడా తమకు ఇష్టం అయింది కదా ని వేయకాయ . పెల్లుల్లి షాంపూలు , పాల మీగడ వంటివి తలకు పట్టించుకుంటే - వారిని వారి పుట్టింటికి పంపి వేయటం జరుగుతుందని " తీర్పు ఇవ్వటమైనది అన్నాడు .
"స్త్రీలు పిడికిళ్లు బిగించి " మా జుట్టు పై నీ పెత్తనం ఏమిటి ?" "పేదరాయుడూ డౌన్ డౌన్" అంటూ నిప్పుల లాంటి నినాదాలు ఇస్తారు కాబోలు అని కొందరు ఎదురు చూసారు .

" కాదు కాదు . ఎప్పుడు పడితే అప్పుడు పుట్టింటికి పోవాలని ఆలోచన లేని స్త్రీ ఉండదు . అందుకు భర్తల పర్మిషన్ దొరక్క వెనుకాడుతూ వుంటారు . ఇప్పుడు ఈ తీర్పువల్ల స్త్రీలకు ఆ వీలు దొరికి నట్లయింది .ఇప్పుడు స్త్రీలు పెదరాయుడూ జిందాబాద్ " అంటూ నింగినంటే నినాదాలు ఇస్తారు కాబోలు "అని కొందరు ఎదురు చూసారు. .

"ఈ తీర్పు ను బట్టి మా కష్టాలే మరింత పెరుగుతవి. అని మొగవారు మహాఘోరంగా ఘొల్లు మంటారు కాబోలు " అని మరి కొందరు ఎదురు చూసారు .

ఏమిజరుగవచ్చో ? అనే ఆలోచనలతో - తన ఈ సొంత కథను రాసినది వారణాసి ఉమా శ్రీరామ కృష్ణ అఫ్ అమరావతి

## **10.** మరీ యవ్వనంగా **18-12-24**

సుధాకర మూర్తికి నలభై రెండు ఏండ్లు వచ్చే సరికి భార్యా వియోగం అయింది . పిల్లలు లేరు . నిన్ననో మొన్ననో మళ్ళా వివాహం చేసుకోవాలనే

ఆలోచనలో పడ్డాడు .  తనంతట   తానుగా పడలేదు  . అతడు పని చేసే ఆఫీసులోకి సంధ్య రాణి ఆమె వచ్చి చేరింది . ఆమె   పడేసింది.

సంధ్య రాణి వయసు 35  అని  , ఆమె భర్త చనిపోగా ఆమెకీ వుద్యోగం ఇచ్చారని , ఆమెకు సంతానం కూడా లేదని , ఆమె బయో డేటా ఫైల్ చూసి తెలుసుకున్నాకనే , మూర్తి మళ్ళీ  పెళ్లి అనే  ఆలోచనలో పడ్డాడు . మెల్లగా మెల్లగా ఆమెను అప్రోచ్ అయి కొన్ని  గ్రీన్ సిగ్నల్స్ కూడా పొందాడు .

" నేను నిన్ను పెండ్లి చేసుకుందాము అనుకుంటున్నాను " అని తాను ప్రొపోజు చేస్తే ఆమె కాదనదు అన్న నమ్మకం కుదిరిన రోజు న,   మూర్తి సంధ్యా రాణి తో  తన మ్యారేజ్ ప్రపోసల్ చెప్పాడు . అందుకామె మూడు రోజుల వ్యవధి కోరింది . మూడోనాడు  ఏమన్నాదంటే " మీరు మరీ యవ్వనంగా  కనపడటం  నాకు భయమవుతోంది . అందుకని వద్దు ." అన్నది . ఆపై మూర్తి ఎంత నచ్చ చెప్పినా ఆమె కాదనే అన్నది .

ఆమె మాటలకు అర్థం ఏమిటి ? అని మూర్తి జుట్టు పీక్కున్నాడు . అతనితో పాటు ఆలోచనలకు కూచున్న అతని ఫ్రెండ్స్ కూడా జుట్టు పీక్కున్నారు . చివరికి మూర్తి వెళ్లి ఓ మానసిక వైద్యుడిని సంప్రదించి " ఆమె ఇట్లా అన్నదండి . దానికి అర్థం ఏమిటో కాస్త విశ్లేషించి చెప్పండి " అని కోరాడు .

అయన ఒక నిట్టూర్పు విడిచి " స్త్రీల మనసు అగాధము అన్నారండి . అందువలన మీరు వెళ్లి మీకు  తెలిసిన స్త్రీని ఎవరినన్నా అడగండి . వాళ్లేమో చెప్పొచ్చు.  ఆలా కాదంటే ఫేస్ బుకు లో మీ కొచ్చెన్ పోస్టు చేసేయండి . అక్కడ స్త్రీల మనసు లోతులను కొలిచిన  ఎందరో పురుష లేదా స్త్రీ మేధావులు వుంటారు.  వారు ఎదో ఒక్కటి తప్పక చెపుతారు  " అన్నాడు .

మూర్తి  ఓ వేయి ఫీజు కట్టి పై  సలహా పొంది వచ్చాడు  కాబట్టి - " మీరు మరీ యవ్వనంగా  కనపడటం నాకు భయమవుతోంది . అందుకని వద్దు" అన్న

సంధ్యారాణి మాటలకు అర్ధం ఏమిటో విశ్లేషించండి . సంధ్యారాణి మనసులో వున్నా విషయం ఏమిటో తెలిస్తే - తానేమి చేయాలో మూర్తి తెలుసుకుంటాడు . అప్పుడు మూర్తి అదేదో చేసి ఆమెను పెళ్లి చేసుకో కలుగుతాడు . ఒక పెళ్లి చేసిన పుణ్యఫలం మీకు దక్కుతుంది కావచ్చు .




My self on 21-12-24 at chunchi falla near bangalore

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ .

**9.**ఏమవుతుందో **?? 17 -12 -24**

{ఈ కథ 16.12.20 .న మొదటిసారిగా ఫేస్బుక్ లో పోస్టు చేసాను . "ఓల్డ్ మెమోరీస్" కింద ఫేస్బుక్ వారు ఈ స్టోరీని నాకు గుర్తు చేశారు }.

నేను ఒక షాప్ దెగ్గర వున్నాను .షాప్ పావు వంతు రోడ్డును మింగేస్తూ రోడ్డు మీదకు వుంది . ఆ షాప్ దెగ్గర నే రోడ్డుని సగం మింగేస్తూ - ఒక చిన్న టీ స్టాల్ వుంది . అక్కడ ఒక్కే ఒక్క కుర్చీ వుంది . అది టీ స్టాల్ యజమాని - బేరం లేనప్పుడు కూర్చోటానికి వాడే కుర్చీ అనుకోవాలి .

నేను చూస్తూ ఉండగా వయస్సు నలభైదాటి భారీ కాయము కలిగిన , ఓ పల్లెటూరి స్త్రీ ఒకామె రొప్పుతూ వచ్చి " ఆమ్మో నేనింకా నడవలేదు- గుండె దడగా వుంది .. అమ్మా అమ్మా .. అంటూ - వచ్చి టీ స్టాల్ లోని కుర్చీలో చటుక్కున చతికిల పడింది . ఆమె నడవలేక చెమటలు కక్కుతున్నది .కన్నుల నీరు తిరిగి వుంది . ఇందాక ఆమె పలికిన మాటలు - -ఆమె పక్కనే నడుస్తూ వున్నా భర్తకు చెప్పిన మాటలు .మనకు చెప్పిన మాటలు కాదు .

ఆమె అలాకూచున్న మరు క్షణమే - టీ స్టాల్ లోని స్త్రీ శరవేగంతో బయటికి దూసుకొచ్చి " చాలు చాల్లే లేగమ్మా .. మా కుర్చున్నావుగాని" అంటూ - లంఖినీ లా , కుర్చీలో కూచున్న స్త్రీ మీదకి లంఘించింది .కుర్చీలో కూచున్న ఆమె జబ్బా పట్టుకు పైకి లేపి - పక్కకు తోసి , తనకుర్చీని బరబరా ఈడ్చుకొని వెళ్లి లోపల పెట్టుకుంది ." కుర్చీ ఇరిగితే నీ బాబిస్తాడా ?" అనే ఆగ్రహం కూడా వెళ్ళ కక్కింది

ఏమిటీ లోకం ? మన కుర్చీ క్షేమంగా ఉండటం ముఖ్యమా ? అవతల మనిషి క్షేమంగా ఉండటం ముఖ్యమా ? ఆమెకు నిజంగానే గుండెపోటు లాటిదే వచ్చిందే అనుకుందాం ? ఆమెకు ఏమి దారి ? రోడ్లన్నీ ఆక్రమించి షాపులు పెట్టుకోవటానికి తలవూపిన , మున్సిపాలిటీ వారు , తమ పౌరులు ఇలాంటి ఆపదలో పడ్డప్పుడు కాసేపు విశ్రమించటానికి అని ఎక్కడా ఒక్క సిమెంట్ బెంచి కూడా ఏర్పాటు చేయలేదు.కదా ?- పోనీ రోడ్డు మీదననే చతికల పడదామన్నా చోటుకూడా లేదు కదా ? అని విచారం కలిగింది .

ఆ విచారం లో పడి   " కొంత మంది మంచి నీటి చలివేంద్రం పెట్టి - మంచి నీరు ఇచ్చి ప్రజలను సేద తీర్చి పుణ్యం చేసుకుంటూ వుంటారు . అలాంటి పెద్దలే పూనుకొని  రోడ్డు మీద ఒక షామియానా లాంటిది వేసి - అందులో ఫది కుర్చీలు   వేసి , నడవలేని జనం - కాసేపు విశ్రమించేందుకు ఏర్పాటు   చేస్తే ఎంత బాగుంటుంది  - అలాంటి ఆలోచన  ఏ మహాత్ముడికన్నా వస్తే ను ఎంత బాగుండు " అనుకున్నాను .

సరే  -  నేను ఇంకా పెద్దయ్యాక ( బోలెడంత సంపాదించాక అన్న మాట ) . పోలీసు వాళ్ళను అధికారులను మంచి చేసుకొని ఆ షామియానా వేసే  పని ఏదో నేనే చేస్తాను" -   అని నాకు నేనే  నచ్చ చెప్పుకున్నాను .

అది కూడా కాదనుకొని  ఇట్లా అనుకున్నాను " నేనింకా చిన్న మనిషినే . దేనికీ సిగ్గు పడకుండా సెత్తిన నాలుగు ప్లాస్టిక్  కుర్చీలు పెట్టుకొని  ఈ రోడ్డు వెంబటినే  తిరుగుతూ , నడవలేక నడవలేక నడుస్తున్న వాళ్లకు కుర్చీ వేసి కూచో  బెడదాం . వారిని సేద తీరుద్దాము . ఇదంతా మొదట్లో ఏదన్నా ఎబ్బెట్టుగా వున్నా - రాను రాను జనం అలవాటు పడతారు. ఏదవుతే అదవుతుంది  " అనుకున్నాను .

ఏమవుతుందో ??

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కధ .

ఈ కథ మొదటి సారి పోస్టు చేసినపుడు 30  మంది షేర్ చేసుకున్నారు . అంటే బాగా జనాదరణ పొందినది అనుకుని - ఆ ధైర్యంతో మళ్ళా పోస్ట్ చేస్తున్నాను .

**8.**ది బ్యాంకు అఫ్ అమరావతి     **17-12-23**

నేను నా తోడల్లుడూ ఇద్దరమూ కూడానూ బ్యాంకు ఉద్యోగులమే . ఇద్దరమూ కూడా అమరావతిలో వున్న రెండు ప్రముఖ బ్యాంకులలో పనిచేసి రిటైరు అయినాము . ఖర్చులు కలిసి వస్తాయని ఒకటే ఇల్లు అద్దెకు తీసుకొని అందులో రెండు కుటుంబాల వారము ఉంటున్నాము . ఈ రకంగా ఇంటిలోని ఆడవారికి ఎంతో కాలక్షేపము దొరికింది . కానీ మాకే ఏమీ కాలక్షేపము లేక పోయింది. అందు వల్ల ఒకసారి మేము ఇట్లా తీర్మానించుకున్నాము " దీని తస్సా దియ్యా .. మన రిటైర్మెంట్ తరువాత మనకు కాలక్షేపముఅంటూ ఏమీనూ లేకుండా పోయింది .మనము కూడా ఒక బ్యాంకు పెట్టుకుందాము . బ్యాంకు అనగా ఏమిటంటే వచ్చే లాభ నష్టాలతో పనిలేకుండా జనానికి ఋణాలు ఇచ్చి , ఇవ్వటం లోని మాజాని అనుభవించి చివరికి తాను దివాళా తీసేదే బ్యాంకు అంటేనూ "అని మేము ఒక నిర్ణయానికి వచ్చాము .

పై దివ్య సూత్రాన్ని అనుసరించి మా ఊరైన అమరావతిలో -- ఎవరినుండీ ఎటువంటి అనుమతీ పొందవలసిన అవసరం లేనట్టు వంటి ఓ బ్యాంకు తెరుద్దామని - నిర్ణయించాము . మా పని ఏమిటంటే ---మేము లోను ఇస్తాము - తీసుకునే వాళ్లు వస్తారు .మేము ఆ వచ్చిన వాళ్ళకి ఏమేమో కొచ్చన్లు వేస్తాము . యా అల్లా .. అట్లాగా మాకు ఎదో కాలక్షేపం అయిపోతుంది . లోను తీసుకున్న వాళ్ళనుండి తిరిగి రాబట్టటం మా పాలసీ కాదు . ఎగ్గొట్టటానికి వీలు లేని లోను కోసం ఎవరూ రారు కదా ? అని డిసైడ్ అయి పోయి -- మన కాల్సక్షేపం కోసం అని మనము కొంత డబ్బు నష్టపోయినా పరవాలేదు అన్న ధోరణితో తో మేము బ్యాంకు తెరిచాము .

బ్యాంకు అంటే అట్టే ఏమీ లేదు . మా వీధి గది కి ఒక కిటికీ ఉంటే - దాన్ని అటూ ఇటూ మార్పించి , బోర్లించిన పొత్రము ఆకారములో కన్నము ఒకటి పొడిపించాము . ఆ రంధ్రము చూస్తేనే చాలు అర్థం అయిపోతుంది . ఇక్కడేదో డబ్బు ఇస్తారు పుచ్చుకుంటారు అని .

ఆలా పై కన్నుము తోని మేము బ్యాంకు స్టార్ట్ చేసాము .పేరు డాబుగా వుండాలని అలోచించి , బ్యాంకు అఫ్ అమెరికా లాగా బ్యాంకు అఫ్ అమరావతీ అని దానికి బోర్డు పెట్టాము .బోర్డు అంటే ఎదో కాదు . ఆడవారు పెట్టుకునే తిలకం బుడ్డిని వాడి మా కిటికీ మీద ది బ్యాంకు అఫ్ అమరావతి అని రాసి న కాగితము అతికించి పెట్టాము .

ప్రజలే వచ్చి ఇదేమి బ్యాంకు అండి ? అని అడిగారు . మేము ఇస్తామన్న చిన్న చిన్న లోన్లు అవీ చూసి - మాది మంచి స్టాఫ్ వున్న బ్యాంకు అని వారే అన్నారు . మా బ్యాంకు చేసే కార్యకలాపాలు - ముఖ్యముగా మాకు లాభము రాక పోయినా సరే -- మా కాలక్షేపము కోసము అని చేసినావి కొన్ని వున్నవి . వాటిలో కొన్ని పనులగురించి చెపుతాను .

ఒకటీ -- గాజుల మీద ఋణము - షాపుల ముందు ను,.మార్కెట్ యార్డులలోను చిమ్మే సుబ్బాము అనే ఆమె వచ్చి చీపురు మరియు చీపురు కర్రా కొనుక్కొనుటకు ఒక లోను అడిగింది . మేము ఆమెను తరచీ తరచీ ప్రశ్నించీ - ఆమె గాజులు పెట్టుకొని మూడు వందల ఋణము ఇచ్చాము .ఆమె గాజులు ప్లాస్టిక్ వి . అందు వల్ల లోను తిరిగి రాక పోతే మేము ఏమి చేయాలి అన్న దాని మీద మా తోడల్లుళ్ళము చేర్చించుకుంటూ చాలానే కాలక్షేపము చేసాము .ఇలాంటి రుణాలు ఎన్నో వున్నవి .

రెండు - చిల్లర రుణాలు - పిల్లలు బడికి వెడుతూ ఉంటే - తల్లులు ఆ పిల్లల చేతిలో ఐదో ఫదో పెట్టి పంపుతూ వుంటారు . ఒక్కో సారి తల్లుల దెగ్గర పెద్ద నోట్లు ఉంటాయి అసలు డబ్బులే వుండవు అనుకోండి .మరి పిల్లలేమో చేతిలో డబ్బులు పడందే బడికి బయలు దేరరు . అందుకని ఈ అవసరం నిమిత్తము మేము తల్లులకుచిల్లర డబ్బులు రుణముగా సమకూర్చాము . వారి దెగ్గర పెద్ద నోటు ఉంటే చిల్లర ఇస్తాము . అసలు చేతిలో ఏమీ లేదండీ అంటే మావద్ద వున్నా చిల్లరనే వారికి రుణంగా ఇస్తాము . రోజుకు ఫది చొప్పున ఇవ్వటం అనేది ఈ రుణాలకు లిమిట్ . తీసుకున్న వారే హామీ . వారే ఎప్పుడో వున్నప్పుడు ఒక వంద మా చేతిలో పెట్టి మా ఋణం మాఫీ

అయ్యిందీ ?  అని అడుగుతారు . వారి లెక్క డొక్కా చూసి వారి ఋణం మాఫీ చేయటం మాకు పెద్ద పని మరియు పెద్ద కాలక్షేపం అయ్యింది .
మూడు --ఫిక్సెడ్ డిపాజిట్ స్కీం - ఒక నాడు ఒకరు వచ్చి ఓ ఐదు వందలు ఫిక్సెడ్ డిపాజిట్ చేస్తాము అన్నారు . బ్యాంకు అన్నాక ఫిక్సెడ్ డిపాజిట్ లు లేకుండా ఎట్లాగా ? దాని మీద వడ్డీ అనేది ఎదో ఒకటి ఇవ్వకుండా  ఎట్లాగా ? అందుకని మేము ఆ ఐదు వందలూ తీసుకొని - ఒక ఫది రూపాయల నోటు మీద " రిసీవుడు - 500 - ఫిక్సెడ్ డిపాజిట్ విత్ వన్ రూపీ ఇంటరెస్ట్ - ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమెరికా " అని రాసి వారికిచ్చి ఇట్లా చెప్పాము - " ఇక ఈ ఫది రూపాయల నోటు ఎక్కడా చెల్లదు. కానీ  దాన్ని భద్రం గా పెట్టుకొని - తిరిగి మాకు ఇచ్చి వేస్తే మీకు 501 రొప్పయాలు ఇస్తాము" . ఇలాంటి ఫిక్సెడ్ డిపోజిట్స్   ఎన్నో వచ్చినవి .  ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి  " వారణాసి శ్రీ రామ కృష్ణ అని రాసి సంతకము పెడుతూ ఉంటే వళ్ళు పులక రించేది . అందుకోసమే వందలాది ఫిక్సెడ్ డిపాసిట్లు సేకరించాము .
నాలుగు - ఓవర్ డ్రాఫ్ట్ స్కీం -- మా ఇంటి పక్కనే ఓ కిరాణా దుకాణం ఉంటే వాడితో మాట్లాడి నాము . మా ఒప్పందం ప్రకారం ఆ షాపు వాడు ఎవరికన్నా సరుకులు అప్పు ఇవ్వవలిసి వస్తే , ఆ అరువు అడుగుతున్న వారిని మా వద్దకు పంపుతాడు . మేము ఒక ఫది రూపాయల నోటు మీద
" వన్ హండ్రెడ్ రూపీస్ ఓవర్ డ్రాఫ్ట్ సాంక్షన్డ్ -- ఇట్లు  చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి  "అని రాసి సంతకము పెట్టి వాళ్ళకిచ్చి మా ఒళ్ళు పులకరింప చేసుకునే వాళ్ళము . ఆ నోటు చూసి షాప్ వాడు తన ఖాతాదారులకు సరుకులు అరువు ఇచ్చేవాడు .
ఈ రకంగా షాప్ వాడు అరువు మీద ఇచ్చిన సరుకులకు మేము హామీ పడ్డాము కదా ? .సరుకులు తీసుకున్న వాళ్ళు  అప్పు కట్టక పోతే మేమే కట్టాము -- మేము పూచీ పడ్డాము కాబట్టి - ఇందులో   లాభము వచ్చిందా నష్టము వచ్చిందా ?అని లెక్కలు చూసుకోవటంలో మాకు బోలెడు కాల క్షేపము దొరికింది . మొత్తము మీద ఇప్పటికీ మా సంతకాలకు ఎంతో చెల్లుబడి వున్నది కదా  యా  అని సంతోషించాము .

ఐదు - కిడ్డీ స్కీం - చిన్న పిల్లలు లేక్స్ పొటాటో చిప్స్ తెగ నములుతూ వుంటారు కదా ? దానితో వారికొచ్చే రోగాలు అనేకము . అందుకని మేము ఒక స్కీం పెట్టాము . మాకూ సమాజం పట్ల భాద్యత వుంది కదా ? అందుకై అన్నమాట . ఏ పిల్ల లేదా పిల్ల వాడైనా సరే, మా దెగ్గర ఒక లేక్స్ పొటాటో చిప్స్ ప్యాకెటు డిపాజిట్ చేస్తే ఒక వారము తరువాత అతనికి రొండు బెల్లము పల్లీల పప్పుండలు ఇస్తాము . ఇక ఆ చిప్స్ బ్యాంకు వారు జప్తు చేసుకొని - టీ తాగుతూ తినేస్తారు .. ఇదీ మా కిడ్డీ స్కీం .

ఎటిఎం స్కీం - ఎవరికన్నా ఎటిఎం కార్డు కావాలంటే - వారి ఆర చేతి మీద " ది బ్యాంకు అఫ్ అమరావతి - ఎటిఎం - విత్ డ్రా లిమిట్ 10 టూ 500 " అని ఒక పెన్నుతో రాసి కిందన ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి మా సంతకము చేస్తాము. మళ్ళా పులకరించి పోతాము .ఈ ఏటీఎం కార్డు కలిగిన వారు రాత్రి ఏడూ మరియూ ఫది గంటల మధ్య మా దెగ్గరికి వచ్చి ఆ చేయి చూపించి కావాల్సిన సొమ్ము విత్ డ్రా చేసుకోవచ్చు .ఇలాంటప్పుడు మేము సహజంగా యాభై రూపాయలు ఇస్తాము అంటాము. "కాదు కాదు-- మాకు ముందుకు తక్కువ పడ్డాయి మీరు రొండు వందలు ఇవ్వాలి " అని వారు బ్రతిమాలుతారు . ఎంతో బ్రతిమాలించుకొని మేము ఇస్తాము .ఇట్లాగా మా చుట్టూ పక్కల మా విలువకూడా పెంచుకున్నాము . చేతుల మీద రాయించుకోవటానికి వచ్చేవారితో మా బ్యాంకు కిక్కిరిసి పోతూ ఉంటుంది . చివరాఖరికి మేము లెక్కలు చూసుకుని - సాలుకు మూడు లక్షల నష్టము వచ్చి నది అని తేల్చుకున్నాము . అందరూ ఎగ్గొట్టే వాళ్ళే వుండరుకదా ? అందువల్ల తక్కువగానే నష్టము వచ్చినది . తక్కువ నష్టముతో - ఎక్కువ కాలక్షేపము పొందుతూ వుండటాన మేము మా బ్యాంకు ఆఫ్ అమరావతిని ఇంకా ఇంకా ముందుకు నడప తలిచాము .
మేము క్రొత్త పథకాలు ప్రవేశపెట్టినపుడు మీకు తెలియ పరుస్తాను . సండే చికెన్ స్కీం , మొక్కు కు రుణాలు , నైటీ స్కీం - అనేవి ప్రవేశ పెట్టాలని ఆలోచిస్తున్నాము . నైటీ స్కీం లో -ఎవరైనా ఒక మహిళా వచ్చి "మా

పొరుగింటి  అవిడ నెల రోజుల బట్టీ నైటీ వాడలేదు , చీరలోనే వున్నది   " అని రెకమండ్ చేస్తే - మేము వారికి "వన్ గ్రేమ్ గోల్డ్ " నగలుకొనుక్కునేందుకు " పైసా వడ్డీ మీద ఫదివందల రుణాలు ఇస్తాము . అదన్న మాట .
ఇట్లు  ది చీఫ్ మేనేజర్/ లోన్స్-- వారణాసి ఉమా శ్రీరామ కృష్ణ / ది బ్యాంకు అఫ్ అమరావతి

**7.** అక్కా  కేటరింగ్ వారి గన్ షాట్ గురుగింజలు    **16 -12 -24**

మేము అక్కా అని పిలిచే ఒకమ్మాయి మాకు  ట్యూషన్ చెప్పే పంతులుగారిని పెళ్లాడింది . ఆ పెళ్లి లో వాళ్లకు  చప్పట్లు కొట్టింది నేనే .  ఆ దంపతులను మేము అక్కా పంతులు గార్లు అంటాము . పంతులు గారికి చాలా ఆస్తినే వుంది . తండ్రిని చూసుకోవటం కోసం ఉద్యోగాలు చేయక ఉన్న ఊళ్ళోనే -- అంటే మా అమరావతిలో నే  ఆగి పోయాడు . పంతులుగారు తన  తండ్రి మరణాంతరం--   మా  వూరు వదిలి వెళ్లి హైదరాబాద్ లో కేటరింగ్ బిజినెస్ పెట్టు కున్నారు .

నేను అప్పటికి రికామీ గా తిరుగుతున్నాను .గన్ షాట్ గుజింగింజలు అనేవి తయారు చేసి అమ్మి పొట్ట పోసుకోవటం తప్ప,  ఇంకో విధం ఏమీ తెలియ కుండా బ్రతుకుతూ వున్నాను  . గన్ షాట్ గురుగింజలు అనేవి  ఓ ఆయుర్వేదపు మందు ఉండలు .  ఇవి మా అమరావతిలోని ఛోటా ఆయుర్వేద వైద్యుడు సూర్య ప్రకాశరావు గారి తయారీ . ఆయన మొదట్లో ఆయుర్వేదం అధ్యనం చేసాడు . ఆ తరువాత రసవాదం అనగా పాదరసాన్ని బంగారంగా మార్చే విద్య  లోకి  దిగి వున్న దంతా పోగొట్టుకున్నాడు . చివరికి పొట్టపోసుకునే దానికోసం అని "గన్ షాట్ గురుగింజలు" అనే విరోచనాల/ అజీర్తి/ ఆకలి  మాత్రలు చేసి అమ్మేడు . ఎందుకో ఒకందుకు అని ఆ "గన్ షాట్ గురుగింజలు" తయారు చేసే విధం నాకు కూడా నేర్పాడు . ఈ మందును గురువింద గింజలంత పరిమాణంలో తయారించి ఎండలో ఆరపెడితే

ఎండతగిలిన పై భాగము ఎర్రగానూ ఎండతగలని కింద భాగము నల్లగానూ తయారయి - అచ్చం గురుగింజలను పోలివుండేవి .తింటే తియ్యగా ఉండేవి .ఒక్కటి కనుక నమిలి మింగితే - నిన్న రాత్రి తిన్నది మొదలు - వారం రోజులకింద తిన్నది కూడా చక్కగా తిరిగి ఝాడించి విరోచనం అయ్యేది . ఒక్కటంటే ఒక్కే విరోచనంతో కథ సుఖాన్తమ్ కావటం - ఆపై అగ్ని హోత్రం లాంటి ఆకలి పుట్టుకు రావటం ఈ మందు స్పెషలిటీ . ఈ మందు మూలకంగా మా ఛోటా ఆయుర్వేద వైద్యుడు సూర్య ప్రకాశరావు గారు ఆ జీవన పర్యంతం తిండికి లోటు లేకుండా కాలక్షేపం చేసాడు . అయన తదనంతరం ఆ "గన్ షాట్ గురుగింజలను " తయారు చేసి వూళ్ళో అమ్ముకొని - పొట్టపోసుకుంటూ రికామీగా జీవిస్తున్నాను . ఇదే నాకు -- నా ముందుకు - ఈ కధకు వున్న నేపధ్యం .

ఒకానొక రోజు అక్కా పంతులు ఎందుకో మా వూరొచ్చి నన్ను చూసి బ్రైట్ గా మొహం పెట్టి " నువ్వొచ్చి మాతో జతకలువు . నీకోసం మా దెగ్గిర ఓ మంచి ప్లానుంది అందులో నీకు మంచి ఫ్యూచర్ ఉంది " అని చెప్పారు. అక్కాపంతులు కలిసి క్యాటరింగ్ పెట్టారుకదా ? ఆ బిజినెస్ లో ఇప్పటికే చాలా పోటీ వుండటాన వీళ్ళ క్యాటరింగుకు పెద్ద గుర్తింపు కానీ ఆర్డర్లు కానీ దక్కటం లేదు . కాబట్టి వాళ్ళు నన్ను కూడా కలుపు కొని ఇహమందు ఇట్లా చేద్దాము అనుకున్నారు . వాళ్లకు క్యాటరింగ్ వర్క్ దొరికన చోటకు నన్ను కూడా తీసుకెడతారు . టిఫిన్ తరువాత కాఫీ లో టీ లో ఎంవి కావాలంటే అవి ఇచ్చి- ఆ తరువాత నేను నా "గన్ షాట్ గురుగింజలను - దాని పని తీరును " అతిధులకు పరిచయం చేసి - దాని పనితీరుకు ఇష్టపడి- కావాలన్న వారికి ఒక గురు గింజ ఫ్రీగా ఇస్తాను .ఇది ఎందుకంటే? నా సేల్సు కోసమో నా పేరు కోసమో కాదు . . ఈ రోజుల్లో యజమానులు క్యాటరింగ్ వారికి చెప్పి ఎన్నో రకాల వంటకాలు చేయిస్తున్నారు . కానీ తినే వాళ్ళు తినలేక పోతూ వున్నారు .వండిన వారు వండించిన వారు ఆ తినలేని వాళ్ళను చూసి బిక్క మొఖాలు వేస్తూ వున్నారు . దీనికి కారణం వచ్చిన అతిధులకు ఉన్న అజీర్తి, ఆకలి లేకపోవటం, కడుపులో కదలిక లేకపోవటం ఏ కదా ? . మా గన్ షాట్

గురుగింజలు తిన్నాక అజీర్తి హరించుకుపోయి , కడుపు ఖాళీ అయి , ఆకలి పెట్రేగి పోతుంది . అప్పుడు వాళ్ళు - క్యాటరింగ్ లో వండిన వంటకాలన్నీ ఎగపడి తింటారు . అప్పుడు క్యాటరింగ్ కి ఆర్డర్ ఇచ్చిన యజమాని కంటిలో దీపావళి వెలుగులు కనపడతాయి . ఇదే మా క్యాటరింగుకు కావాల్సింది . అదే మా విజయానికి మెట్లు కావలి .ఇదీ మా అక్కాపంతులు క్యాటరర్స్ స్పెషలిటీ కావాలి . ఇందుకు గానూ నాకు కేటరింగ్ నుండి వచ్చిన లాభాల్లో పది పైసల వాటా ఇస్తారు. కాబట్టి నేను నా గన్షాట్ గురుగింజలని ఎవ్వరికీ అమ్మకూడదు .వేరే ఎవరికీ ఫ్రీగా నైనా సరే ఇవ్వకూడదు వాళ్లకు దొరికిన క్యాటరింగులో ని గెస్టులకు ఫ్రీగా ఇవ్వాలి అనేది కండిషన్ "

పై కాన్సెప్ట్ ను- అంటే గన్ షాట్ గురుగింజల్ని ప్రెవేశ పెట్టినాక అక్కపంతులు వాళ్ళ క్యాటరింగ్ బిజినెస్ ఎక్కడికో ఎగబాకింది . కొత్తల్లో - ఒక సారి ఓ అయన నూతన గృహ ప్రేవేసానికి మాకు క్యాటరింగు ఆర్డర్ ఇచ్చి " అంతా బాగానే వుంది. వచ్చిన అతిధులు ఆవురావుబు మని వంటకాలు తింటూ ఉంటే చూడటానికి మాకు కన్నుల పండుగగానే ఉంటుంది . కానీ వాళ్ళు మా వాష్ రూమ్ని వరస పెట్టి వాడుకుంటూ ఉంటే మా స్త్రీలు ఒప్పు కోరేమో " అని డౌట్ అనుమానం వెలిబుచ్చాడు . ఆ వెంటనే అక్కాపంతులు కూడబలుక్కొని ఓ మొబైల్ వాష్ రూంని తయారు చేయించి దాన్ని కూడా క్యాటరింగ్ చేసే చోటే ఎవరికీ అభ్యంతరం లేని ప్రదేశంలో పార్కింగ్ చేయించారు . దీని తరువాత - ఫంక్షన్ కి వచ్చిన అతిధులు ఎంతో క్యాజువల్ గా ముందుకొచ్చి " మాకో గన్ షాట్ గురుగింజ ఇవ్వండి అని అడిగి మరీ తీసుకొని తిని - నిర్భయం గా మా మొబైల్ వాష్ రూమ్ వాడి - ఆపై విందుభోజనాన్ని సుష్టుగా తిని అందర్నీ- అంటే పెట్టిన వారిని - పెట్టించిన వారిని మెచ్చు కుంటూ వెళ్ళ సాగారు. కొందరైతే మాకో గురుగింజ ఇంటికివ్వండి అని కొద అడిగారు . అందుకు రూల్సు ఒప్పుకోవు అని మేము సున్నితంగా తిరస్కరించాము .

పైలా ఓ ఆర్నెల్లు గడిచే సరికి - అక్కాపంతులు కేటరింగ్ వారు దొరకటం - గృహస్థులకు ఓ గగన కుసుమం కింద మారి పోయింది . క్యాటరింగ్ వారికి -

నాకూ క్షణం తీరిక దొరక్కుండా పోయింది . ఎంత తీరిక లేకుండా పోయింది రా సామీ అంటే , నా వంతు వచ్చిన డబ్బును లెక్క పెట్టుకొనే తీరిక లేక ఆ నోట్ల కట్టలను తూకం వేసి ఓ గదిలో పడేసుకున్నాను . 500 రూపాయల కట్టలు ఓ నలభై కిలోల తూకం వి ఇప్పుడు నా దెగ్గర వున్నాయ్ . అక్కా పంతులు వద్ద ఎన్ని కేజీలు ఉన్నాయో వారికే తెలుసు నెమో గానీ నాకు తెలీదు .

కాలం ఎంతో ఖటినం అయినది . నన్ను ఎంతో ప్రేమగా చూసుకునే అక్కా పంతులు ఒకే సారి దివంగతులు అయ్యారు . ముందు అక్కా చని పోయింది. ఆమెకోసం అని గుండె పగిలేలా ఏడ్చి పంతులు దివంగతుడు అయ్యాడు . వాళ్ళ పిల్లలు నా గన్ షాట్ గురుగింజలకు పెద్ద వేల్యూ ఇవ్వలేదు . నా ఆదాయపు లెక్కలు సరిగా చూపలేదు . అప్పుడు నేను - " అక్కా" క్యేటరర్ అని ఓ సొంత కుంపటి ప్రారంభించాను . అక్కా క్యాటరింగ్ గురించి ఇప్పుడే ఏదన్న చెపితే అది నా సొంత డబ్బా కొట్టుకునట్లు అవుతుందని భావించి దాని సంగతి ఇంకెప్పుడో చెపుదామను కుంటూ వున్నాను .

వారణాసి ఉమా శ్రీరామా కృష్ణ అఫ్ అమరావతి సొంత కధ .




WRITER VARANASI UMA SREE RAMA KRISHNA ON 15-12-24 AT BANGLORE RURAL ROAD

## **6.**పరలోక ప్రయాణం **16-12-22**

సూన్యం సోమేశ్వర రావుగారి పిల్లలు పెరిగి పెద్దయి ఎక్కడెక్కడనో సెటిల్ అయినారు . ఇంట్లో ఆయన ఆయన భార్య సూన్య  కాలం గడప సాగారు.

ఇట్లా ఈ సూన్యంలో ఎన్నాళ్ళు గడిపినా, చివరికి వెళ్ళ వలసింది ఆ అనంతమైన సూన్యము లోనికి ఏ గదా ?
అదేదో గబుక్కున వెళ్ళిపోతే తిరిగి పునర్జన్మ పొంది సుఖ పడవచ్చును గదా ? అన్న ఆలోచన ఈయనకు కలిగింది . అప్పుడు వేదాంత గ్రంధాలను ఆశ్రయించి ఎంతో చదివి
యోగ సమాధి లోకి వెళ్లి ఇచ్చా మరణం పొందటమే మంచి మార్గం అని కనిపెట్టాడు .
యోగ సమాధి పొందాలంటే ముందుగా భవబంధాలను తెంచుకోవటం అతి ముఖ్యం అని " యోగ వేదాంత సారం " లో రాసివుంది.
భవబంధాలను తెంచుకోవటం లో భాగంగా - భార్యకు ఎదో గట్టి ఏర్పాట్లు చేసి చివరికి ఆమెకీ మరి ఎవరికీ కూడా చెప్పకుండా - ఎవరితోనూ సంప్రదించకుండా మిగిలివున్న ఆస్తులన్నీ అమ్మి సొమ్ము చేసుకొని దాన్ని బ్యాంకులో వేసి పెద్ద మూల నిధి తయారు చేసుకొని - ఎవరికీ చెప్పకుండా వెళ్లి - ఒక పల్లె లో ఆశ్రమం లాంటి గుడిసె కట్టుకున్నాడు .
ఊరిలోని కరణం గారిని , బడి హెడ్ మాస్టార్ గారిని , ఊరి పోస్ట్ మాస్టారుగారిని ఒక కమిటీగా వేసి - పూర్తిగా తన డబ్బే వెచ్చించి మంచి పనులకు శ్రీకారం చుట్టాడు .
మొదటిది - పేద స్కూల్ పిల్లలకు ధన సాయం చేయటం . సోమేశ్వర రావుగారు ఫది మంది ఎడవ తరగతి విద్యార్థులని గుర్తించి - వారు ఎంత వరకు చదివితే అంతవరకు చదివించేట్లు - కొంత నిధి ని ఇచ్చాడు . ఈ ఫది మంది అయి పోగానే ఇంకో ఫదిమందికి సాయం అందుతుంది .
కూలి పనులకు పోలేక సంపాదన లేక పస్తులుంటున్న పేద వృద్ధులని గుర్తించి - వారికి జీవితాంతం - నెలకు ఇంత అని ఇవ్వటానికి - మరియు చివరిలో వారి మట్టి ఖర్చులకు అని కూడా కొంత డబ్బు ఇచ్చేట్లు నిధిని సమకూర్చాడు .
ఇలాంటివే అయన ఎన్నో పనులకు నిధిని సమకూర్చాడు . నిధి అయిపోగానే యోగ సమాధి సాధించాలని ప్రయత్నం ఆరంభించాడు . కొన్నాళ్ళకి అది సక్సెస్ అయ్యింది .

ఒకనాటి ఉదయం ఆయనకు పనులు చేసి పెట్టె పని మనిషి వచ్చి " అయ్యా ఇవిగో పాలు " అని అయన ముందు పెట్టి , ఎదో అనుమానం వచ్చి మనిషిని కుదిపి చూసింది .
పద్మాసనం లో కూచున్న సోమేశ్వరంగారు బిళ్ళ బీటుగా వెనక్కు పడి పోయాడు ,
ఊరి వారు ముఖ్యంగా,ఊరిలోని కరణం గారు , బడి హెడ్ మాస్టార్ గారు , ఊరి పోస్ట్ మాస్టారు గారు అయన చనిపోయినాడని నిర్ధారించుకున్నారు .
పోస్ట్ మాస్టర్ గారి వద్ద ఈయన కొడుకుల తాలూకు అడ్రెస్స్ లు వున్నాయి .
ఈ యన కొడుకు లందరికీ టెలిగ్రామ్ లిచ్చాడు .ఈ కొడుకులు మొత్తం నలుగురు .
తండ్రి ఇంటినుండి వెళ్ళిపోయినాక , వీరు తండ్రిగురించి జాడలు తీసి తండ్రి ఉంటున్న పల్లెని , అయన తన ఆస్తినిఅమ్మగా వచ్చిన డబ్బును దూబరా చేస్తున్న తీరును తెలుసుకున్నారు . మాకు ఆస్తులు చేదా ?మాకిస్తే మేము తినమా ? అని అలిగి , ,ఆస్తి విషయం పైసలా అయ్యింది కాబట్టి - తండ్రి ఆచూకీ తెలిసినాగానీ వారు వచ్చి తండ్రిని కలవలేదు . భవబంధాలు వదులుకున్నాడు- డబ్బు వదిలేసుకున్నాడు . ఇక మనకేమి మిగిలింది అలోచించి అని గమ్మునున్నారు .
పోస్ట్ మాస్టార్ గారికి రిప్లై టెలిగ్రాంలు అందాయి . దరి దాపుగా అందరిదీ ఒకే ఆన్సర్ " సెలవులు లేవు . డబ్బు సమకూర్చుకొని 10 రోజుకి వస్తాము. ఈ లోపుగా మీరు కానివ్వండి - ఖర్చులకు అయన ఎదో అట్టే పెట్టుకొని ఉంటాడు అనుకుంటున్నాము " అని
ఈ టెలిగ్రాములురానూ పోనూ రెండు రోజులు పట్టింది . మూడవ నాడు ఉదయం సోమేశ్వరం గారు కాళ్ళూ చేతులు విదుల్చుకొని పాడెమీదనుండి లేచాడు .
" అయ్యా మీరు చని పోయారని మేము అందరమూ అనుకున్నాము.
అందుకే మిమ్మల్ని... "అంటూ చెప్పి కించ పడ్డాడు హెడ్ మాస్టర్ గారు .

" మీ తప్పేమీ లేదండి . యో గా సమాధి ద్వారా ఇచ్చా మరణం చెందాను . ఈ రెండు రోజులూ మీరు సంరక్షించింది నా కళేబరాన్నే ." అన్నాడు సోమేశ్వరం గారు .

" ఎట్లాగా ?ఎందుకు ?ఎల్లా ?తిరిగి వచ్చారు ? అని కరణం గారు ఆరా తీశారు .

" అయ్యా ఇచ్చా మరణం తరువాత మనము వెలుతురు నిండిన గుహ లో నుండి - ప్రయాణం చేస్తాము . గుహ్ చివరన ఇద్దరు సేకుర్టీ గార్డ్లు వుంటారు . "రా రా పైలోకాలకి రా " అని దేముడినుండి మనకు అందిన డిమాండ్ నోటీసు లేదా తాఖీదు వాళ్లకు చూపిచ్చక పోతే వాళ్ళు మనకీ వెనక్కి నెట్టేస్తారు . పోవటం పొయాగానీ వాళ్ళు తలుపు తీయందే నేనేమి చేతును ? చివరికేమిటంటే రమ్మన్నప్పుడే పోవాలి .మనంతట మనం పోను వీల్లేదు . ఈ లోగా అనుభవించాల్సిందంతా అనుభవించాలి "

" అయ్యా మీకొడుకులు ఇట్లా అన్నారు " అని ఒక గ్రామస్థుడు చెప్పాడు . "తండ్రుల కంటే ముందుగా కొడుకులే భవబంధాలు వదిలించుకుకుంటాబు " అని - నేనువెళ్ళిన గుహలో ని గోడమీద బ్లాక్ పెయింట్ తో రాసివుంది . నాలాంటి వాడే ఎవడో రాసివుంటాడుఅది చదివి ఆలోచించుకుని - అందుకు సిద్దపడే వచ్చాను " అన్నాడు సోమేశ్వరం గారు . "

.

a original by varanasi sree rama krishna

**5."పో పోయి పేకముక్కల్ని నమ్ముకొని బ్రతుకు పో " 12 -12 -24**

సాయంత్రపు టీ తాగి పడక్కుర్చీలో పడుకొని ఆరాం అవుతూవున్నాను . సన్నని కునుకు కూడా పట్టింది . ఎవరో వచ్చి నా ఎదురుగా నిలబడి దగ్గారు . మూరెడు జుట్టు జానెడు గడ్డం తో ఉన్న వాడు ఒకడు నాముందు నిలబడి వున్నాడు . " ఎవరయ్యా నువ్వు నేరుగా మా వరండాలోకి వచ్చేసావు . బెగ్గింగ్ కి ఓ వేళా పాళా లేదా ? అని నేను గరం అయ్యాను .

""కాదండి బాబాయి గారు నేను దశరధ్" ని అన్నాడు అతడు . ఆ గొంతును పట్టి అతన్ని గుర్తు పట్టి కూచో పెట్టి " ఏమిటిలా వచ్చావు ? ఏమిటి నీ ఈ వాలకం ? అని ప్రశ్నించాను జాలితో .

"ఏమిచెప్పమంటారు బాబాయ్ గారు . ఓడలు బళ్ళు అయినట్లు నా బ్రతుకు అంతా తిరగ పడి పోయింది . నాన్న చనిపోయేక చెప్పేవాళ్ళు లేక వున్నదంతా పేకాటలో తగలేసాను . ఇప్పుడు నేను నా పెళ్ళాము ఇట్లా మిగిలేము . మిమ్మల్ని గుర్తు చేసుకొని ఇలా వచ్చేను అని అతడు బదులిచ్చేడు .
"రావటం మంచిదే అయింది . నాకూ ఏమీ తోచుబడి కాకుండా వుంది . ఓ రౌండ్ పేకాట వేద్దాము . రాత్రికి భోజనం చేసి వెళుదువు కూచో "అన్నాను .
"పేక ముట్టుకొను అని ఇంటిదానిమీద ఒట్టు వేసుకున్నాను . నా కేదన్న పొట్టగడిచే మార్గం చూపిస్తావేమో అని నీ సలహా కోరి వచ్చాను" అని అతడు అన్నాడు .

" అరేయ్ అబ్బాయ్ - పోయినా చోటనే వెతుక్కో మన్నారు . ఈ పేకల్లో నుండే నీకు జీవనోపాధి చూపిస్తాను సరా " అంటూ నేను ఇంట్లో కెళ్ళి రెండు పేక కట్టలు తెచ్చి వాడి ముందు పరిచాను . దశరధం వాటిని చూసి అసహ్యంగా మొఖం పెట్టాడు .
"నీ ఒట్టుకు ఏమీ కాదులే ఆ పూచీ నాది" అని చెప్పి ఆ పేక ముక్కలు , ఓ పెన్ను వాడి చేతులో పెట్టాను . ముందుగా ఓ డజను పేక ముక్కలు తీసి పక్కన పెట్టు అని చెప్పి, ఆపని అయ్యాక . ఇప్పుడు మిగిలిన పేక ముక్కలోనుండి ఓ పేక ముక్క తీసుకొని " దాని వెనక వైపున " దైవం మీకు అనుకూలిస్తాడు " అని రాయి అని చెప్పి అలా రాయించాను . ఇలాగే మిగతా పేకముక్కలు తీసుకొని " అనుకోని ధనలాభం " " ప్రయాణాలు అనుకూలిస్తాయి " "కోర్టు వ్యవహారాలలో జాప్యం " " విందు భోజన ప్రాప్తి " " అనుకోని అనారోగ్యాలు " " ఆడవాబు నూతన వస్త్రాలు - నగలు - బహుమానాలుగా పొందుతారు " అనే ఇటువంటి మాటలు ఓ ఎనబై తొంబై

చెప్పి దశరధం చేత ప్రతి పేక ముక్క మీదా ఒక్కో వాక్యం రాయించాను . మా ఆవిడని పిలిచి నువ్వూ కొన్ని మాటలు చెప్పు అన్నాను " అనుకున్న పనులు సకాలంలో అవుతవి " "అర్ధరాత్రులు ఉలికి పాటుకు గురి ఆవుతారు " పూల పెంపకం - వ్యవసాయం కలిసి వస్తుంది " "కొబ్బరి - వ్యాపారులకు పూల వ్యాపారులకు అనుకూలించే రోజు " "కందిపప్పు ధరలు తగ్గవచ్చు " అంటూ ఓ ఇరవై మాటలు చెప్పింది . ఆ తరువాత నేను అరేయ్ " నీ అంతటా నీవుగా కొన్ని మాటలు రాసుకోరా
అంటే వాడు ఇట్లా రాసుకున్నాడు . " ఖర్చులు పెట్టేటపుడు జాగ్రత్త " " మిత్రులమని నమ్మించే వంచకుల పట్ల అప్రమత్తత అవసరం " " నేడు కలిసి రాలేదనికలత పడవద్దు - రేపు కలిసివస్తుంది "" విజయం మీ సమీపంలోకి వచ్చి దూరం పోతుంది " " ఇంటి లో చిక్కులు ఎదురవుతాయి " " భార్య భర్తల మధ్య ప్రణయ కలహాలు ఏర్పడతవి " వంటి మాటలు ఓ పది పదిహేను రాసాడు . ఇట్లగా ఎదో ఒక వాక్యంతో ప్రతి పేకముక్క నింపేసాము .

అబ్బాయి ఇప్పుడు ఆ పన్నెండు పేక ముక్కల మీదా " మేషరాశి "" వృషభ రాసి " కర్కాటక రాశి"సింహ రాసి " అంటూ పన్నెండు రాసుల పేర్లు రాశి పారేసి, వాటిని ఈ టేబుల్ మీద విడి విడిగా బోర్లా పరువు , ఆ తరువాత మనం మాటలు రాసిన పెట్టి పేక ముక్కల్ని బాగా కలిపి "రాశి" అని రాసిపెట్టిన ముక్కల మీద ఒక్కొకటి గా పెట్టేయి ". అన్నాను అతను అలాగ పెట్టేసాడు .

బోర్లా పరిచిన పేకల్ని చేతిలోకి తీసుకొని అందులో ఏముందో చదువు అన్నాను . వాడు ఆపేకలు చూస్తూ ఇట్లా చదివాడు . " వృషభ రాశి - ప్రయాణాలు అనుకూలిస్తాయి," అనుకున్న పనులు సకాలంలో అవుతవి " " ఇంటి లో చిక్కులు ఎదురవుతావి " అంటూ చదివేడు .

" అబ్బాయి దశరధం ఇప్పుడు నేను నీకు జోస్యం చెప్పే విధానం నేర్పేసాను .నువ్వు ఒక యూ ట్యూబ్ ఛానెల్ ని ఎంచుకొని - అందులో దిన

ఫలాల జోస్యం చెప్పుకో . ఈ పేక ముక్కలు మాత్రం కెమెరా కంటికి అనకుండా జాగర్త పడు . అలాగే నువ్వు వాడి పారేసిన పేక ముక్కలు కొన్ని మళ్ళా పోగేసుకొని వాటి మీద "విద్యార్థులకు పోటీపరీక్షల్లో విజయం " " ఆకస్మిక నిర్ణయాలు తీసుకోక పోవటమే మంచిది " దురాశకు పోవొద్దు స్టాక్ మార్కెట్ పట్ల అప్రమత్తత అవసరం " అనే నీతి వాక్యాలు రాయి . ఇటువంటి వాక్యాలు రాసిన పేక ముక్కలు నీదెగ్గర ఎన్నుంటే అంత మంచిది . నీ చేతి సత్తావా కొద్దీ ఉన్న పేక ముక్కలన్నింటిని కలబోసి వాటిని రాశులకు పంచి పెట్టి - దాని ఆధారంగా దినఫలాలు జాతకాలూ చెప్పటం మొదలెట్టు . ఆ గడ్డము ఆ జుట్టు తీయకుండా ఇంకా అట్టలు కట్టించు . మేడలో రుద్రాక్షలు వేయి .కంటి రెప్పల మీద కుంకుమా రాసుకో . నువ్వు కళ్ళు మూసుకొని ఎదో ఆలోచిస్తున్నట్లు బిల్డుప్ ఇస్తే - ఆ కుంకుమ రంగు కన్నుల పట్ల ప్రేక్షకులకు ఎదో ఓ భక్తి భావం కుదురుతుంది . అట్లాగే పెదాలకి పసుపు పులుముకో . నువ్వు మాట్లాడుతూవుంటే చూస్తూ ఉండాలి అనే కోరిక జనం లో కలుగు తుంది . ఇహ ఒక నిమ్మకాయ పుచ్చుకొని దాన్ని ముక్కు మీద రుద్దుకొని - దాని నుండి ఒక చుక్క రసం పిండి ఆపై ఫలితాలు చెప్పు ఇక తిరుగుండదు . మొదట్లో నీకొచ్చే ఆదాయం తిండికి బట్టకు కూడా చాలదు . అయినా నిరాశ పడకు . నింపాదిగా నీకు అభిమానులు మొదలై " దశ సామి " అని నీకు బిరుదు ఇచ్చి- మానవుల జీవితంలో వచ్చే దశలకు దిశలకూ నీవే పరిష్కార మార్గం చెప్పగలవని నీ చుట్టూ తిరిగి నీకు లక్షలు సమర్పించుకుంటారు . పో పోయి పేకముక్కల్ని నమ్ముకొని బ్రతుకు పో " అని నేను దశరథానికి సలహా చెప్పి అతడికి బ్రతుకు తెరువు ఇచ్చి పంపేసాను .

" ఇవాళా మా "దశ స్వామి " నిమిషం మాట్లాడినందుకు నాలుగు వేలు ఫీజు అడిగే విధంగా డెవలప్ అయ్యాడు . రోజుకి ఉన్న 24 గంటలూ అతడికి సరి పోవటం లేదు . అదీ సంగతి .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కల్పిత కధ

4.అవిశ్వాస తీర్మానం      **11 -12 -2024 .**

పాత సినిమాల్లో హీరో ఇన్  హీరోని  కవ్విస్తూ " రారా నన్నేలుకోరా " అంటూ చిందులు వేస్తుంది. జానపద హీరోయిన్ గారు వచ్చి " అయ్యో ఆయన నన్నేలుకోనన్నాడు " అంటూ తన కొచ్చిన కష్టం తడ్రితో చెప్పు కుంటుంది. ఆమె అంటే భార్య ఏలుకో బడేది .మరొచ్చి భర్త అంటే ఏలే వాడు అనే కదా అర్ధం ?. ఆమె అనగా భార్య అనే ఆమె లక్ష మంది ప్రజల పెట్టు. తనను ఏలే భర్త పాలిటికి ప్రతి పక్ష నాయకి లాంటిది . ఆమె తరచూ తనను ఏలేవారి మీద అవిశ్వాస తీర్మానం వేస్తూ ఉంటుంది .

" మీకేమీ చేత కాదు మీకేమీ తెలీదు . వంకాయలు తెమ్మంటే పుచ్చు వంకాయలు ఏరుకోని తెస్తారు -బెండకాయలు తెమ్మంటే ముదురు ములక్కాయలు తెస్తారు " అంటూ  ఆమె పలికే మాటలన్నీ ఆమె తన భర్త మీద ప్రవేశ పెడుతున్న అవిశ్వాస తీర్మానాలే   అనుకోవాలి .  భర్త తాను అధికారం లో ఉండి  ఆమెను ఏలుకోవాలంటే తనపై వచ్చిన ప్రతి అవిస్వాస తీర్మానం నెగ్గక  తప్పదు . లేక పోతే తాను ఎలవాల్సిన రాజ్యాన్ని కోల్పోయి చావటాయి  పదవి పొందుతాడు .

భార్యలు భర్తలతో అనేవన్నీ అవిశ్వాస తీర్మానాల కిందకే వస్తవి . కాదంటే ఛాలెంజ్ . భర్తలు బ్రతికేది అంతా ఆ అవిశ్వాస తీర్మానం నెగ్గటానికే . కాదంటే దీనిక్కూడా  నా ఛాలెంజ్ .

మా పొరుగింటి అప్ప గారు ఒకరున్నారు . నేను వారి ఇంటిలోకి పోగానే ఆమె " నువ్వు నన్ను చంపటానికి చూస్తున్నావు "అంటూ తన భర్త మీద అనే అవిశ్వాస తీర్మానం ప్రెవేశపెట్టింది  . వింటున్న నేను అదిరి చచ్చాను . నాపొరుగింటిలో రేపో ఎల్లుండో ఏదన్నా మర్డర్ స్టోరీ జరిగి - పోలీసులు వచ్చి నన్నుసాక్ష్యం కింద విచారిస్తారో ఏమో అని .

అవిశ్వాస తీర్మానం ప్రవేశ పెట్టిన మా అప్పగారిని వివరాల కోసం ప్రశ్నించాను . వివరాలు ఏమంటే --' ఆమె మామిడి కాయ గుర్తున్న రాజకీయ పార్టీకి అభిమాని .వారిచ్చిన
తాయిలాలు పుచ్చుకొని వారికీ ఓటేసింది .-- ఆయన నిమ్మకాయ గుర్తున్న రాజకీయ పార్టీకి అభిమాని .వారిచ్చిన తాయిలాలు పుచ్చుకొని వారికి ఓటే సాడు .

పై రెండు పార్టీల వారు ఏకమై సంకీర్ణ ప్రభుత్వం పెట్టారు . ఇప్పుడు మామిడికాయ పార్టీ వారు " పార్టీ సభ్యత్వాలు నమోదు చేసుకుంటూ వున్నారు . వీరు --పార్టీ లో ని సభ్యుడు మరణిస్తే రెండు లక్షల సొమ్ము వారి నామినీకి ఇస్తారు . ఇదే రకంగా నిమ్మకాయ పార్టీ వారు కూడా సభ్యత్వాలు నమోదు చేస్తూ వున్నారు . వీరు తమ పార్టీ సభ్యుడు మరణిస్తే ఐదు లక్షలు నామినీకి ఇస్తారు .
ఇప్పుడు నిమ్మకాయ పార్టీలో వున్న భర్త మామిడి కాయ ఆపార్టీకి సభ్యత్వం కట్టి నామినీ కింద తన భార్య పేరు రాసాడు . ఇదేమీ బాగోలేదు అనుకొంటే - ఇంతకన్నా బాగో లేని సంగతి ఇంకోటి జరిగింది . మామిడికాయ పార్టీకి అభిమానిగా వున్న తన భార్య పేరు తీసుకువెళ్లి ఆమెకు తెలీకుండా నిమ్మకాయ పార్టీ లో రాయించి - ఆమె నామినీగా తన పేరు రాసుకున్నాడు . ఈ మతలబు ఎలాగో భార్యకు తెలిసింది .ఈ నేపథ్యంలో ఆమె " నా పేరు మామిడి కాయలో కాకుండా నిమ్మకాయలో రాయించావు . అంటే నన్ను చంపేసి నా నామినీ కింద ఆ ఐదు లక్షలు కొట్టేసి నీ తమ్ముడి బిడ్డలకు పెట్టుకోవాలని చూస్తున్నావు . అదే నువ్వు చచ్చి పోతే నాకు రెండు లక్షలు మాత్రమే వచ్చి నేను మరింతగా ఏడవాలని చూస్తున్నావు . నీ ప్లాను - నాకు తెలుసు నువ్వు నన్ను మర్డర్ చేస్తావు " అంటూ భర్త మీద అవిశ్వాస తీర్మానం పెట్టింది .

మరి భర్త ఈ అవిశ్వాస తీర్మానం నెగ్గటం ఎట్లాగో మీరే చెప్పండి . చెప్పేముందు ఇంకొంచెము తెలుసుకోండి . ఈ భార్యా భర్తలు అరవైలు దాటి

డెబ్బయిల్లోకి వచ్చారు. పిల్లలు లేరు . ఆమె కు తమకున్నదంతా తన చెల్లెలు పిల్లలకు ఇవ్వవలెనని కోరిక . ఆ ప్రయత్నాలు బాహాటంగానే చేస్తూ ఉంది . ఇహ ఆయనకు తమకున్నదంతా తన తమ్ముడు కొడుకులకు ఇవ్వాలని కోరిక . ఆ ప్రయత్నాలు బాహాటంగానే చేస్తూ ఉంటాడు . తనని చంపి వున్న ఆస్తి అంతా తన తమ్ముడు పిల్లలకి చెందేట్లు చేసుకుంటాడేమో అని భార్య కున్న మొదటి అపనమ్మకం . ఇప్పుడు వున్న ఆస్తికి ఇంకో ఐదు లక్షలు జత పరిచి - ఆ మొత్తాన్ని అయన తన తమ్ముడు పిల్లలకి ఇచ్చుకోవటానికి అయన ప్లాన్ చేస్తూ వున్నాడని - ఆ ఇంకో ఐదు లక్షలు సంపాదించుకోవడం కోసం అని అయన తన పేరును మామిడి కాయలో కాక నిమ్మకాయలో రాయించాడని .ఇహ తనను మర్డర్ చేయటం ఒక్కటే మిగిలిందని " ఆమె భర్త మీద పెట్టిన అవిశ్వాస తీర్మానం లోని విషయము .

ఇలాంటి అవిశ్వాస మర్డర్ తీర్మానం భర్త కూడా - భార్య మీద పెట్టే అవకాశం వున్నది కదా? అని మీరు అనుకో వచ్చు . కానీ భర్త అంటే ఏలే వాడు . ఏలే వాడు ఎవరిమీదా అవిశ్వాస తీర్మానం పెట్టలేడు కదా? అదీ అక్కడ ఉంది పితలాటకం .
తన మీద వచ్చిన అవిశ్వాస తీర్మానం లో నెగ్గి - భర్త గారు బైట పడతాడో లేదో -మీ కున్న రాజకీయ చెతురత నంతా వుపయోగించి మీరు బదులు చెప్పాలి .

ఎన్నో రకాల అవిశ్వాస తీర్మానాలు ఎదుర్కుంటూ - అందులో నెగ్గటానికి జీవితాన్ని ధారపోస్తున్న భర్తలు అనేకులు వున్నారని మా అమరావతిలో చెప్పుకుంటారు .ఇది వారికి అంకితం .

వారాణసి ఉమా శ్రీ రామ కృష్ణ యొక్క సొంత కల్పిత కథ

**3.**అబ్బాయీ మనం దడుచుకోవటానికే పుట్టినం

"నాన్నా నీవు దేనికి భయ పడుతున్నావు ?"

మా అబ్బాయి నేను మాట్లాడుకుంటూ వున్నాము . అవి ఇహ లోకపు సంగతులు . నేను ఎదో ఆగగా మా వాడు అట్లాగా ఓ ప్రశ్న వేసాడు .
" నా కున్న భయము నా ఒక్కనిదే కాదు . నేను నిన్ను పెంచి పెద్ద చేయటం లో నేను పడ్డ కృషి -
ఒక రూపాయి కూడ పెట్టి మీకు ఇవ్వాలన్న నా తాపత్రయము ,నేను సాగించిన జీవన విధానము , నేను సాధించాను అనుకుంటూ వున్న విజయాలు ఇవన్నీ మీరు మరిచి పోతరోమో ? రేపు అన్న తరువాత నాకు విలువ ఏదీ ఉండదేమో ? , నేను స్థాపించిన నైతిక ప్రమాణాలను మీరు తోసిపుచ్చుతారేమో ? అని నేను భయపడుతూ వున్నాను . ఇలాంటి భయం మా తాతకూ వచ్చింది. మా తండ్రికీ వచ్చింది నాకూ వచ్చింది . ఇహ నీకూ వస్తుంది . నా భయానికి విరుగుడు గా -- నువ్వూ నాలాగా భయపడటం నేర్చుకుంటే నాకు అదే చాలును .కాబట్టి అబ్బాయీ ఇప్పటి దాకా నేను చెప్పిన భయాల గురించి దడుచుకోవటానికే మనము పుట్టినం. అదే ఉన్నత జీవితము కాబట్టి అట్లాగే బ్రతుకుదాము "

అప్రస్తుత ప్రసంగం లాగా ఇంకా ఇట్లా చెప్పాను . " తల్లులు పిల్లలకు అన్నం పెడుతూ అదుగో బూచోడు వస్తున్నాడు అన్నం తిను అని భయపెడతారు . బూచిని చూపిస్తానని భయపెట్టక పోయినా ఆకలి ఐన పిల్లలు అన్నం తినక మానరు . ఆకలికి కాక ఇంకా దేనికో భయపడటం అనేది ఎంతో పనికి వచ్చే విధానము అని - కాబట్టి తల్లి పిల్లలకి భయం అనేది నేర్పుతున్నది . ఆ భయం పునాదుల మీద నిలబడిన - నీవు " నేను చక్కగా చదివి చక్కని ఉద్యోగమో చేయకపోతే నా పొట్ట నిండదేమో అని భయ పడటం నేర్చుకున్నావు . ఉద్యోగానికి లేటుగా వెడితే ఏమవుతుందో అని భయపడటం నేర్చుకున్నాక ఒక క్రమ శిక్షణను అలవర్చుకుని నీవు చక్కగా జీవిస్తూ వున్నావు . ఇప్పుడే కాదు కానీ -ఇంకా ముని ముందు - షుగర్ గురించి

భయపడటం  తెలుసుకున్నాక నువ్వు చపాతీలు తినటం అలవాటు చేసుకుంటావు .. బీ పీ గురించి భయపడటం నేర్చుకున్నాక  ఉప్పులేని పప్పు తినటం అలవాటు చేసుకుంటావు . ఊరగాయలు మాని వేసి -వాటి గురించి  భయపడటం లోని ప్రయోజనాలు ఏముంటే అవి పొందుతావు . హార్ట్ ఎటాక్ లు బ్రెయిన్ స్ట్రోకులు తప్పించుకుంటావు . నువ్వు నీ ఆహారం లోని "అతిని" గురించి భయపడుతూ ఉంటే మా కెంతో సంతోషంగా ఉంటుంది . అట్లాగే నువ్వు నీ తాత తల్లి తండ్రుల   జీవితం నీ స్మృతి పధంలో మరుగు పోతుందేమో అని భయ పడుతూ ,  ముందుకు పోతూ ఉంటే కూడా మాకెంతో సంతోషంగా ఉంటుంది . అమ్మ నేర్పిన భయము నాన్న నేర్పిన భయము అన్నింటికీ మించిన మంచి భయాలు . కాబట్టి అబ్బాయీ మనం దడుచుకోవటానికే పుట్టినం" అదే మంచి జీవితము కాబట్టి అట్లాగే బ్రతుకుదాము " అని మా వాడికి భయం నేర్పాను .
వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత రచన

## 2. మంచి మంచిది కాదా ?    4-12-24

చాలా పూర్వకాలం - ఎప్పుడో  ? అంటే ఎప్పుడో ఒకప్పుడు ఓ ఇండో నేషియా రాజుగారు నిద్రలేచి పండ్లు తోముకుంటూ వున్నాడు .రాత్రి కావాలిగా వున్నా బంటు పరుగెత్తుకు వచ్చి " ఇండో రాజా -- ఇండో రాజా - వింత వార్త వింత వార్త .  ఎవరో  మనిషి ఒకడు , ఓ పడవ వంటి దానిలో కూచుని ,తెడ్డు ఆడిస్తూ , మేఘాల మధ్య కుండా ముందుకు సాగి పోతూ వున్నాడు . " అని విన్నవించాడు .తాను తెచ్చిన వార్త పట్ల కావలివాడు ఎంత వింత పడుతూ వున్నాడంటే - వాడు రాజుగారిని ఏక వచనంలో  సంభోదించేసాడు .

ఇండో రాజు గారి ఆజ్ఞ మీద . శంఖాలు ఊది , డోళ్లు మోగించీ . నేలమీద మంటలు వెలిగించీ - ఆ నింగిలో పడవ మీద విహరిస్తున్న వాడి ద్రుష్టి తమ

వైపు తిప్పుకొని - "నువ్వు కిందకి రా మా రాజుగారు  నీతో మాట్లాడాలి అనుకుంటున్నారు " అంటూ పిలిచారు రాజ భటులు .

గాలి పడవ వాడు కిందకు వచ్చి రాజు అడిగిన మీదట ఇట్లా చెప్పుకున్నాడు " రాజా నేను మీ రాజ్యము వాడనే . ఓ దశాబ్ద కాలము పరిశోధించి ఈ పడవ కని పెట్టాను . పడవతో నీటిలో ప్రయాణించినట్లు , ఈ పడవతో  మనము గాలిలో ప్రయాణించవచ్చు . "
రాజు మరికొన్ని ప్రశ్నలు వేసాడు దానికి సమాధానంగా  ఆ గాలి పడవ వాడు " ఇప్పటికి ఇదొక్కటే తయారు చేసాను . ఇలాంటివి తయారు చేయటం నాకు నేనుగా నేర్చుకున్నాను . తయారు చేసుకున్నాను . నాకు గురువు లేడు శిస్యుడూ లేడు . మీరు అనుగ్రహించి డబ్బు దస్కం ఇప్పిస్తే , గురుకుల పద్ధతిలో అనేక మంది శిస్యులను చేర్చుకొని ఈ గాలి పడవను చేయటం ఎట్లాగో వారందరికీ నేర్పుతాను " అన్నాడు .
" ఈ గాలి పడవ ఉపయోగమేమి ?" అని అడిగాడు ఇండో రాజుగారు
" పక్షిలా గాలిలో తిరుగుతూ నేలను చూడటమే  దీని ఉపయోగము " అన్నాడు గాలిపడ వాడు .

రాజుగారు కోపంతో " ఒరేయి శుంఠా ..కొంచెం మంచిగా ఆలోచించటం నేర్చుకోరా . ఇలాంటివి ఇంకా కొన్ని అంటే - ఇంకొన్ని తయారీ అయితే ఆకాశం లో తిరిగే వాళ్ళు ఎక్కువవుతారు . ఒకళ్ళనొకళ్ళు గుద్దుకొని అంత ఎత్తునుండి నేలమీదకు పడి చస్తారు . రాకుమారులు ఈ పడవలనెక్కి వచ్చి రాకుమార్తెలను లేపుకు పోతారు . ఈ పడవలు ఎక్కి శత్రువులు ఒకరి మీద ఒకరు యుద్ధాలు  చేసుకుంటారు .రక్త మాంసాలు నేలమీద కురుస్తాయి . యజ్ఞ యాగాదులకు భంగం కలుగు తుంది . ఇదంతా కాదు అనుకున్నా నీలాంటి వాడో , నువ్వో ఆకాశం మీదనుండి నా పై మూత్రం పోసినా పోయవచ్చు . ఇన్ని అనర్ధాలకు కారణమయ్యే ఈ గాలి పడవ మనకు అవసర మంటావా ? నీది మంచి పనేనంటావా ?  " అని కళ్ళు ఎఱ్ఱచేసాడు .

గాలి పడవ వాడు ఎన్ని చెప్పినా ఇండో రాజు గారు చెవిన పెట్టుకోలేదు అదొక మంచి పని అని ఒప్పుకో లేదు . పైగా "ఇలాంటి గాలి పడవ వలన వచ్చే అనర్థాలు అనేకం ఉన్నవి" అంటూ పడవను కాల్పించి బూడిద చేయించాడు. ఆ గాలి పడవను మళ్లా తయారు చేయకుండా చూడటం కోసమని- వాడిని చంపించాడు . మా రాజు గారు మంచి వారని - మా గురించి మంచిగా ఆలోచిస్తారని ముసలి ప్రజలు జయ జయ ధ్వానాలు చేశారు .

" ఆ మంచి మంచిది కాదు .కాదు కాదు " అంటూ యువత తిరుగుబాట్లు చేసాబు .
"మనము ఎంతో మంచిగా ఉండాలి. మంచి మంచి గానే ఉండాలి " అనే పూర్వీకుల ముందు "మీ మంచి మంచిది కాదు" అన్నవారు నెగ్గటం ఎంతో కష్టం కదా ? అందు వలన ఆ దేశపు యువకులు వెనక్కి తగ్గి జైళ్ళకు వెళ్లారు . విమానాలు పుష్పక విమానాలు వంటివి వారి కథల్లోనూ ఉంటవి కానీ - నిజ జీవితం లో దాని తయారీ లేక పోవటానికి - ఆ విధానం ఏమిటో ఇంకొకరెవ్వరికే తెలియక పోవటానికి సనాతన వాదుల మంచి ఆలోచనలే కారణం అని ఆ దేశపు రహస్య గుహల్లో - రహస్య భాషలో - రహస్యంగా రాసి పెట్టుకున్నారు అని ఓ రహస్య కధనం .
మన పూర్వీకులు కూడా మంచితనం కొద్దీ నే కావచ్చు పుష్పక విమానం ఎవరికీ తెలియనివ్వ కుండా మాయం చేశారు . వివరాలు ఎక్కడా రాసి పెట్టలేదు . ఎక్కడా గీసి పెట్టలేదు . అదే మంచిదయ్యింది . చివరికి దేవదేవుళ్లయినా ఆ రాముడు ఆ కృష్ణుడి కె తెలియనివ్వలేదు . లేకపోతే వారు పుష్పక విమానాలు ఎక్కి యుద్ధాలు చేసి ఉందురు . ఇంకా ఎక్కువ నష్టం జరిగి ఉండును . అందువల్ల మంచి ఆలోచనలు మాత్రమే చేసే వారికి జేజేలు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కధ

**1.**సాంబార్ ఇడ్లీ రిజర్వుడు **03 -12 -24**

సాంబశివ రావు మా ఊరి వాడు. అంటే మా అమరావతి వాడు . మాకు బాల్య మిత్రుడు. ఉద్యోగాలు చేస్తూ మేమేదో బాగు పడ్డం గానీ సాంబా అక్కడే ఆగిపోయాడు . మేము బాగు పడ్డం అంటే సొంత వూళ్ళో అపార్ట్మెంట్ కొనుక్కున్నాము .వాడు ఆగిపోయాడు అంటే రోడ్డు వారగా వాడు స్థాపించుకున్న పాకా హోటల్ అట్లాగే వుంది పోయింది అని .

సాంబాకి ఉడతా సాయంలా ఏదన్న చేద్దామని-- ఓ వీడియో చేసి దాన్ని యూ టట్ లో పోస్ట్ చేసాను . ఆ వీడియోలో సాంబా భార్య ఎంతో పూర్వకాలపు కల్లాకపటం లేని మనిషిలా అగుపిస్తూ నేను రాసిచ్చిన మాటలు ఇలా వల్లించింది " మా హోటల్ లో సాంబార్ ఇడ్లీ స్పెషల్ అండీ .మా అమ్మమ్మ - అమ్మమ్మది తమిళ్ నాడు లోని మారుముల్లై తంగ మల్లై అనే పల్లె. అప్పటి జమీందారుల ఇంట్లో పెద్ద వంటమనిషి . ఆమె జమీందారు గారి పలుకుబడిని వాడుకొని తమిళనాడు మూల మూలల నుండీ సాంబారు పోడి రెసిపీ లను తెప్పించుకొని , అందులో 30 రకాల సంబారులను స్థిరం చేసుకొనిసెలపొడుగునా ఒక్కో రోజు ఒక్కో రకం సాంబారు చొప్పున జమీందారు గారికి వండి పెట్టేది . అప్పుడు ఆ జమీందారు గారు " కర్పగం .. అకస్మాత్తుగా నీకేదన్న అవుతే ఇట్లా సాంబారు చేసేది ఎవరి వల్ల అవుతాది ? చెప్పు . అందుకని నీ సాంబారు- అందులోని దినుసులు , సంబారీ తయారీ విధానం గురించి ప్రతి ఒక్క చిన్న విషయము రాగి పలకల మీద రాయిస్తాను కలకాలం ఉండేలాగా " అని చెప్పి అల్లా చేసాడట . జమీందారు ముందుగా పోయాడు . దాంతో ఆ రాగి పలకలు మా అమ్మమ్మ వాళ్ల అమ్మమ్మకు ముట్టాయి . ఇప్పటికి నాలుగొందల ఏండ్ల క్రితం నాటి ఆ రాగి పలకలు నిన్ననే నాకు కన పడ్డాయి . వాటి ఆధారంగా ఒకరోజు పెట్టిన సాంబారు మరో రోజు పెట్టకుండా, మా హోటల్ లో 30 రోజులకు ముప్పై రకాల రాయల్ సాంబార్లు పెడుతున్నాము . అందరూ వచ్చి మా సాంబారు ఇడ్లీ , సాంబారు గారే , సాంబారు అన్నము తిని మమ్మల్ని ప్రోత్సహించాలని కోరుతున్నాము " అని విన్నపం చేసింది . వీడియో లో ఆమె బ్రహ్మాండంగా చెప్పింది . నేను నాలుగు ఐదు రాగి రేకుల్ని కొనుక్కువచ్చి దాని మీద ఎదో రాసి ఆమె చేతికిస్తే - ఆమె వాటిని కూడా కెమెరా ముందు చూపించింది . అదికూడా బాగా రక్తి కట్టింది .

నేను వుద్యోగం మీద ట్రాన్స్ఫర్ అయి ఒక ఆర్నెల్లు మా వూరికి పోలేదు . పోయినపుడు సాంబశివ రావు హోటల్ కెళ్ళి " ప్లేట్ సాంబార్ ఇడ్లీ" అన్నాను . " నేటికీ సాంబార్ ఇడ్లీలు అయిపోయాయండీ . వున్నవి రిజర్వు అయి పోయాయండీ" అన్నాడు సర్వర్ . సినిమా తీసిన వాడికే టికెట్ లు లేవండి అని చెపితే , రిజర్వేషన్స్ సాధించిన ఆయనకే రిజర్వేషన్స్ వర్తించవని తీర్పు వస్తే, హోటల్ ప్రారంభించిన నాయకునికె టేబుల్ దొరక్క పోతే ఎలా ఎలా ఫీల్ అవుతారో నేను అలా ఫీల్నై అయినాను . క్యాష్ కౌంటర్లో కూచున్న సాంబా దెగ్గరికి వెళ్లి "నీ హోటల్ లో సాంబార్ ఇడ్లీని పుట్టించిన నాకే సాంబార్ ఇడ్లీ లేదన్నారు . ఆ మాట ఆంటానికి బదులు ఇంకో వాయ ఇడ్లీ తీయించాల్సింది . ఇంకో ఆండాళము సాంబారు కాయించాల్సింది . నాది ఆ లెవెల్ . కాదంటానికి మీ హోటల్ నెత్తికి ఎన్ని కొమ్ములు వచ్చినట్లు " అన్నట్లు చిటపట లాడాను . సాంబా నాన్ పెద్దగా కేర్ చేయకుండా - సర్వరుని పిలిచి " రిజర్వేషన్ లో వున్న ఓ సాంబారు ఇడ్లీకి ఇప్పుడే ఓ ఆన్లైన్ కాన్సిలేషన్ వచ్చింది . దాని సీరియల్ నెంబర్ 183 అది తీసి సారు కివ్వు అన్నాడు ". ఎవడో కాన్సుల్ చేసుకున్న ఇడ్లీని తింటానికి నేనెవడ్ని అనుకున్నావు ? అంటూ మనసులో ఆవమానం/ అసహనం ఫీల్ అవుతూ నేను తిన్నాను . సాంబారు మామూలుగానే వుంది రుచిగానే వుంది . కానీ అన్ని చోట్ల లాగే వుంది . మరి అంతేగా ?

ఉద్యోగ ధర్మం మీద అనేక ఊళ్ళు తిరిగిన నేను తిరిగి మా ఊరుకి రావటం అనేది నా రిటైర్మెంట్ తరువాతనే సాధ్య పడింది . సాంబశివరావు హోటల్ ఇప్పుడు "సాంబా భవన్ " పేరిట ఏడంతస్తుల భవనంగా మారింది . అందులో లాడ్జి , పార్టీ హాల్ అంటూ అన్నీ ఉన్నాయి.
నా వీడియో కొన్సెప్టు వల్ల సాంబా ఎంతో ముందుకు పోయాడు . ఇప్పుడు అతడు బాగు పడ్డాడు . నేను ఆగి పోయాను . నేను ఎప్పుడు వెళ్లినా గానీ సాంబారు ఇడ్లీలు రిజర్వ్ అయ్యే ఉంటున్నాయి . నాలో అక్కసు - ఓర్వలేని తనం పెరిగి పోయి -- సాంబా భవనా ? లేక సాంబార్ భవనా ? ఆ రాగి పలలకాల్లో నిజంగా సాంబారు గురించే ఉందా ? ఉంటే ఆ రాగి రేకులు ఇప్పు డెక్కడ వున్నాయి ? సి బీ ఐ పోలీసులు వచ్చి నిజం నిగ్గు తేల్చాలని- ప్రజలు డిమాండ్ చేస్తున్నారు ? " అంటూ ఇంకో వీడియో తీసి పోస్ట్ చేద్దామని ప్లాన్ చేసాను. వాళ్ళు నా దెబ్బకు

దడిచి నా పేరు మీద రోజూ కొంచం సాంబారు రిజర్వు చేసి పెట్టి ఉండేట్లు చేసుకోవాలని . నా రొండో వీడియో ఏమి ఫలితాన్ని ఇస్తుందో చూద్దాము.

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ

నవంబర్ **14**

నేడు 03 --12 -24 మంగళ వారం. ఆమె స్మృతులతో కొంచెము కాలము కన్నీరు నింపుకోవాల్సిన రోజు . చాలా కాలం అంటే ఓ పది హేను ఏండ్ల క్రితం ఈ నా డు పేపర్ లో వచ్చిన ఒక వ్యాసం చదివి నూతక్కి అనే చోట ఓ అనాధ పిల్లల ఆశ్రయం ఒకటి ఉందని తెలిసి అక్కడికి వెళ్ళాను . వూరికే వెళ్లి వస్తే బాగుండదని వారికి ఓ 500 ఇచ్చాను . ఇచ్చి అటు నుండి అటు తెనాలికి అటునుండి మా అత్తగారి ఇల్లైనా చేరుకుపల్లికి ప్రయాణం కట్టాను . నేను స్కూటర్ మీద వున్నాను . చీకటిలో సరిగా కనపడక దారిలో ఆగి ఉన్న ట్రాక్టర్ టిప్పర్ ను వెనకనుండి డీ కొట్టాను . " డీ కొట్టటానికి ఒక్క క్షణం ముందు " నేను దేనినో డీ కొట్టబోతూ వున్నాను . నా మొహం పగిలి పోబోతున్నది .నేను పడిపోయినందుకు కాక - నేను పడి పోతానని తెలినీ ఏ బస్సు వాడో , లారీ వాడో నా మీదకు ఎక్కేస్తాడు . అందుకు చని పోతాను అని అలోచించి నా స్కూటర్ మీద నుండి పక్కకు దూకేసాను .
ఒక మోస్తరు దెబ్బలతోటి - ప్రాణాపాయం లేకుండా బయట పడ్డాను " . ఈ సంఘటనలో ని నా వీరత్వం గురించి ఆ మరునాడు నా భార్యకు చెప్పి " ఆ అనాధ పిల్లల ఆశ్రమంలో ఎదో డబ్బు ఇచ్చి వచ్చిన పుణ్యం నిన్ను కాపాడింది . లేదంటే నీ తాడు తెగి పోయేది " అని జోకాను .

ఆమెకు అనాధలన్నా వారికీ సాయం చేయటం అంటే ఎంతో ఇష్టం . దేముళ్ళ కోసం ఖర్చు పెట్టమనేది కాదు కానీ ఇలాంటి సాయాలు చేయమని మాత్రం పోరేది . నేను అనాధ ఆశ్రమానికి డబ్బు ఇచ్చినది నవంబర్ 14 . అది ఆమె బాగా గుర్తు పెట్టుకుంది . అప్పటినుండి నేటి వరకూ నేను వారికి విరాళాలం ఇస్తూ నే వున్నాను . "నవంబర్ 14 వస్తున్నది. వాళ్లకు డబ్బులు వేరే పెట్టేవా ? రేపు

ఆదివారం కదా నూతక్కి పోయి డబ్బు లు కట్టి వస్తావా ? అని ఆమె నన్ను పోరుతూ ఉండేది . " చిన్న ముండలు తిన టానికి ఎమన్నా తీసుకు పో అని నాచే స్వీట్స్ కొనిపించేది . 500 తో మొదలు పెట్టిన విరాళం క్రమంగా 1000 కి మార్చాను .
ఆమె చని పోయే వరకూ కూడా నన్ను ప్రోత్సహించకుండా ఆగేది కాదు . " నా దగ్గర డబ్బులు లేవు " అని జోకితే " నువ్వట్టాగే అంటావు లే . అది మనకు బరువా . నా మందులు తగ్గించు " అని కూడా అనేది . ఆమె చని పోయాక మళ్ళీ నవంబర్ 14 వచ్చింది . కానీ నా వెంటపడి నన్ను ప్రోత్సహించే మనిషి వెళ్లి పోయింది . ఆమె ఊహలే స్ఫూర్తిగా వారికి విరాళం ఇద్దామని వెళ్ళాను . ఆమె ఎప్పుడు ఆశ్రమానికి రాలేదు . ఎదో ఒక్క సారి వచ్చిందేమో గుర్తు లెదు . పిల్లలకి ఏదన్న తినటానికి తీసుకెళ్లమని అనటం మాత్రం మానేది కాదు . ఆమె మాటలే స్ఫూర్తిగా తీసుకుని ఆలోచించాను . ఆమె తన మరణానికి ముందు తాగిన డ్రింకు మజా మాత్రమే . ఆ డ్రింకు కాకుండా ఇంకో ఎదో ఒకటి మా అమ్మాయి తెస్తే అది నాకు వద్దు మజా నే కావాలి అని పట్టు పట్టింది . అప్పుడు మా అమ్మాయి శైలజ ఎండలో పడి వెళ్లి ఓ ఫది మజా లు తెచ్చి ఫ్రిజ్ లో .పెట్టింది . ఆమె ఒకటో రొండో పీల్చి తాగింది . కాఫీ కాక ఆమె తాగిన ఆహార పానీయం అదే .
తాగినాక ఆమె ముఖంలో కనపడిన సంతోషం చిన్న పిల్లల మొఖంలో కనపడిన సంతోషానికి సమమైనది . అది ఇప్పటికీ నాకు గుర్తు ఉంటుంది .

" నవంబర్ 14 వచ్చింది నూతక్కి వెడుతున్నాను . పిల్లలకు ఏమి ఇవ్వమంటావు ? అని ఆమెను అడిగాను . "మాజాలు ఇవ్వు . వాళ్ళ తోటి పిల్లలు పధి రూపాయలు పారేసి మజా తాగుతూ ఉంటే వీళ్ళు డబ్బులు లేక వీళ్ళు వాళ్ళ కళ్ళే ఎంత ఆశగా చూసే వారో " అని ఆమె చెప్పింది .
అందువలన ఆమెకోర్కె మేరకు పిల్లల కోసం మజా లు కొన్నాను .అవే ఫోటో లో ఉన్న మజా లు .బండిమీద వెడుతూ వెడుతూ ఆలోచిస్తూ " నీపేరు ఏమని రాయించామన్నావు . కీర్తి శేషురాలు ఆంటానికి నాకు మనస్సు రావటం లేదు . అంతకు మించింది ఏదన్న చెప్పు అన్నాను " "మాతృశ్రీ" అని రాయించు అని ఆమె అన్నది . రసీదు అలాగే రాయించాను . దీనికి మా అమ్మాయి కూడా అదే సరి ఐనది - మన అమ్మ ఇప్పుడు అందరికీ అమ్మ అవుతుంది అని అన్నది .

భోజ్యేషు మాత అన్న ప్రకారం ఆమె నాకు మాతృశ్రీ అవుతుంది కదా అనికూడా అనుకున్నాను .
ఆమె చెప్పింది అంటే ? " నేను ఓ ప్రశ్న అడిగితే - ఆమె తన సహజ ఆలోచనా సరళి ప్రకారం ఇట్లా సమాధానం చెప్పి ఉండేది అని నాకు తోచటం తప్ప వేరే ఏమీ కాదు .